ఉపాధ్యాయ సోదరులారా!

విద్యాశాఖవారిచే సంగీకరింపబడిన అనువాదరూప మగునీభూగోళశాస్త్రము నుపయోగించి నాశ్రమము సఫలము గావించిన మీ కెల్లరకుఁ గృతజ్ఞుఁడను. ఈకూర్పునందు ఇప్పటి నిబంధనల ననుసరించి నూతనాంశములు పెక్కుఁ జేర్చియుఁ గొన్ని తావులఁ దగ్గించియు నవరసభరితములగు మార్పులఁ బెక్కింటిని గావించితిని. ఈ కూర్పు అన్నివిధముల మీ యాదరణమునకుఁ బాత్రము కాఁగలదని నావిశ్వాసము. దాదాపుగా నీముద్రణమున నీపుస్తకము స్వతంత్ర రూపము దాల్చినదని యే చెప్పవచ్చును.

ముఖ్యముగ నీ పుస్తకము ప్రైమరి, మిడిల్ తరగతుల విద్యార్థులకొఱకె వ్రాయఁబడినది. ఉపాధ్యాయవృత్తియందలి నాచిరకాలానుభవమే ఈ గ్రంథరచనమునకుఁ బ్రకటనమునకుఁ బ్రోత్సహించినది. ఈపుస్తకముపయి సదభిప్రాయము లొసంగి నన్నుఁ బ్రోత్సహించిన విద్యాధికారులకును, ఉపయోగించి నన్ను ఉత్సాహపఱచిన సోదర బృందమునకును గృతజ్ఞుఁడ నగుచున్నాడను.

హనుమకొండ,<br>సన్ 1—1—1342 } మఖ్దూం మొహియుద్దీన్.



# విషయసూచిక.







# నిజాం రాజ్య భూగోళము.

## మొదటి భాగము

### భూగోళ స్వరూపము.

మనము నివసించు భూమిపై అనేక పర్వతములును నదులును గలవు. అవి మాకు మిట్టపల్లములుగాను సమముగాను ఉన్నవి. దూరమున ఆకాశము వంగి భూమిని తాకియున్నట్లు కనబడును. కాని నిజముగా అది అట్లు లేదు. నారింజపండువలె గుండ్రముగా నున్నది. ఈ ప్రకారమున్నదనుటకు అనేక నిదర్శనములు కలవు.

1. మన మొక పట్టణమును దూరమునుండి చూచితిమేని మొదట గొప్పమేడల పై అంతస్థులును, ఎత్తైన వృక్షముల కొనలును కనబడును. దగ్గరిచేరినకొలది క్రమముగా పట్టణ మంతయు కనిపించును. భూమి చదునుగా నున్నయెడల మొదటి దృష్టిలోనే ఆపట్టణ మంతయు కనబడియుండును కదా.

**2.** సూర్యోదయ సమయమున కిరణములు మొదట పర్వతశిఖరము లందును, గోపురముల పైభాగము లందును పడును. తరువాత క్రమముగా అన్నివైపులను వ్యాపించును. దీనినిబట్టి భూమి బల్లపఱపుగా లేదని తెలియుచున్నది.

**3.** సూర్యాస్తమయ సమయమున ఎండ మొదట మైదానములనుండియు క్రమముగా పర్వతశిఖరములనుండియు తగ్గిపోవును. భూమి చదునుగా నున్న యెడల ఏకకాలమందే చీకటి క్రమ్మవలసియుండునుకదా.

**4.** ఎవ్వరైనను భూమిపై నేక ముఖముగా ప్రయాణమై పోయిన యెడల పోనుపోను బయలుదేరిన స్థలమునకే చేరుదురు. ఇట్లు నేకులు ప్రయాణము చేసి చూచియున్నారు. కనుక భూమి గుండ్రముగా నున్నట్లు తెలియుచున్నది.

భూమి బల్లపఱపుగా కనబడుటకు కారణము:—

చెండు, నారింజపండు మొదలైనవి గుండ్రముగా నుండి గుండ్రముగానే కనబడును. కాని భూమి అట్లుగుపడకుండుటకు కారణ మేమి? అది మీకు ప్రక్కపుటయం దియ్యబడిన పటము వలన తెలియగలదు.

అ, బ, అనునది ఒక పెద్ద చక్రము యొక్క కైవార భాగము. జ, ద, అనునది చిన్న చక్రముయొక్క కైవారము. పెద్దచక్రములోని, స, ర, అను కైవారభాగము చిన్నచక్రము లోని, గ. త, అను భాగముకంటె ఎక్కువ బల్లపఱపుగా కనబడుచున్నది. ఇదేప్రకారము భూమి చాలపెద్దదగుటవలన దాని

# భూగోళస్వరూపము













భూమధ్యబిందువు

అజ - అక్షము

కై వారము గుండ్రమైనప్పటికి బల్లపఱుపుగ కనబడును.

## భూపరిమాణము.

భూమి తిరుగుచున్న బొంగరము వంటిది. అదియెల్లప్పుడు సమవేగముతో తిరుగుచుండును. బొంగరము అతివేగముగా తిరుగునప్పుడు దాని పైచుక్కయు క్రిందిచుక్కయు కదల కున్నట్లే యగుపడును. భూమియు ఆప్రకారమే యున్నది. పై చుక్కకు ఉత్తర ధ్రువమనియు, గ్రింది చుక్కకు దక్షిణ ధ్రువ మనియును పేరు.

భూమికి పై భాగమున ధ్రువములగుండ ఒక రేఖ సూటిగా గీచినయెడల అది 25,000 మైళ్ళ వలయ మేర్పడును. ఇట్టి వలయములను భూవలయము లందురు ఒక ధ్రువమునుండి భూ మధ్య బిందువు గుండ ఒక రేఖ మరియొక ధ్రువమువరకు పొడి చిన యెడల నా రేఖకు అక్షమని పేరు. రెండు ధ్రువములకు నడుమ రెంటికిని సమదూరమున భూమిచుట్టు గీయబడిన వల యమునకు భూమధ్య రేఖ యని పేరు.

ఈ రేఖ భూగోళమును రెండు సమానభాగములుగ విభ జించుచున్నది. పై భాగమునకు ఉత్తరార్ధగోళమనియు క్రింది భాగమునకు దక్షిణార్ధగోళ మనియు పేరు.

పై జెప్పినట్లు ధ్రువములనుండి భూమధ్యముగ ఒక రేఖ గీచినయెడల అది 7,900 మైళ్లుండును. కాని భూమధ్య రేఖ యొక్క వ్యాసము 7,927 మైళ్లుండును. దీనిని బట్టి భూమి ధ్రువముల యొద్ద కొంచెము బల్లపఱుపుగా నుండి సరియైన

గోళము కానట్టు తెలియుచున్నది.

ప్రశ్నలు.

1. భూమియొక్క యాకార మేమి ?
2. భూమిగుండ్రముగా నున్నదని మీ కెట్లునమ్మకము ? దీనిని గూర్చించి మూడు నిదర్శనము లిండు.
3. భూమి గుండ్రముగా నున్నను బల్లపరుపుగా కనబడుటను గూర్చించి నిదర్శనములనుగ నిరూపింపగలవా ?
4. భూమి బొంగరముతో నెట్లు పోల్పనగును ?
5. ధ్రువ మనగా నేమి ? అవి యెన్నిగలవు ?
6. భూమియొక్క క్షైవార మననేమి ?
7. భూమియొక్క వ్యాస మననేమి ?
8. భూమధ్య రేఖ యని దేనికి పేరు ?

స్థలజల భాగములు.

భూగోళము యొక్క యుపరిభాగమున పాతికకంటె కొంచె మెక్కువగా నేలయు మున్పాతికకు కొంచెము తక్కువగా నీరును ఉన్నవి. భూమిగుండ్రముగుటచే మన మొకే పర్యాయము దానినంతయు చూడలేము గనుక దానిని చూచుటకు సమభాగములుగ విభజించి వానిపటము లేర్పడియున్నవి.

ఒకభాగమునకు పూర్వార్ధ గోళమనియు రెండవభాగమునకు పశ్చిమార్ధగోళ మనియు పేరు.

పూర్వార్ధ గోళమందున్న మహాఖండము లివి:— ఆసియా, యూరపు, ఆఫ్రికా. వీనిని గుఱించి జనులకు చిర

కాలమునుండి కొంతవరకు తెలిసియుండుటచే పురాతనప్రపంచ మనుచున్నారు.

పశ్చిమార్ధగోళమందున్న ఉత్తరదక్షిణ అమెరికా దేశపు మహాఖండమును నూతనప్రపంచ మనుచున్నారు.

దీనికి కారణమేమన అయిదు శతాబ్దములకు పూర్వము దీని నెవరును ఎఱుగరు. తరువాత కొలంబసు అనునతడు దీనిని నూతనముగ కనిపెట్టెను. ఇవిగాక ఆసియాఖండము యొక్క ఆగ్నేయమున ఆస్ట్రేలియాఖండ మొకటి కలదు.

ప్రపంచములో భూఖండము లున్నట్లు గొప్ప జలభాగములుకూడ గలవు. ఇవి ఐదు.

1. శాంతమహాసముద్రము (పసిఫిక్). ఇది ఆసియా అమెరికా ఖండముల మధ్య నున్నది.
2. అట్లాంటిక్ మహాసముద్రము. ఇది యూరపుఆఫ్రికా ఖండములను అమెరికానుండి వేరుపఱచుచున్నది.

3. హిందూ మహాసముద్రము. ఇది ఆసియా ఖండమునకు దక్షిణమున నున్నది.

4. ఉత్తర ధ్రువమహా సముద్రము (ఆర్కిటిక్). ఇది ఉత్తర ధ్రువమును చుట్టియున్నది.
5. దక్షిణధ్రువ మహాసముద్రము (అన్టార్కిటిక్) ఇది దక్షిణ ధ్రువమును చుట్టియున్నది.

భూగోళమందున్న స్థల జల భాగములకు నిర్వచనములు కూడ గలవు. వానిని భూగోళశాస్త్రనామనిర్వచనములందురు.

ఇవి రెండువిధములు. సామాన్యనామ నిర్వచనములు. విశేష నామ నిర్వచనములు. సామాన్యనామము లనగా ప్రపంచము నందు అంతటను చెల్లుస్థలజల భాగములపేళ్ళు. విశేషనామము లనగా నాయా ప్రదేశములందే చెల్లునామములు.

## ప్రశ్నలు.

1. ప్రపంచములో స్థలజలభాగముల విస్తీర్ణ మెంత ?
2. పటమందు భూగోళము రెండు భాగములుగ ఎందుకు చూపబడుచున్నది ?
3. భూమి ఏరెండు అర్ధగోళములుగ విభజింపబడినది ? ప్రతిదానిలో నేలయొక్క ఏమహా ఖండము లున్నవి ?
4. పురాతన, నూతన ప్రపంచము లన నేమి ? వీని కీపేరు లెట్లు కలిగినవి ?
5. ప్రపంచములోని మహాసముద్రము లెన్ని ? అవి ఎక్కడ నున్నవి ?
6. భూగోళశాస్త్రపు సామాన్య విశేషనామ నిర్వచనము లన నేమి ?

## సామాన్యనామ నిర్వచనములు.

1. ఖండము :—అనగా కొన్ని దేశములు కలిగియున్న గొప్ప భూభాగము.
2. దేశము :— అనగా ప్రత్యేకముగ పరిపాలింప బడు భూఖండములోని యొకగొప్ప భాగము.

3. ద్వీపము:— అనగా అన్నివైపుల జలముచే ఆవరింప బడిన భూభాగము.

4. ద్వీపకల్పము:— అనగా దాదాపుగ నీటిచే ఆవరింపబడిన భూభాగము.

5. భూసంధి:— అనగా రెండు పెద్ద భూభాగములను కలిపి రెండు పెద్ద జలభాగములను వేరుచేయు ఇఱుకైన స్థల భాగము.

6. పర్వతము:— అనగా భూమికంటె చాల ఉన్నతముగు శిలామయ భూభాగము.

7. గుట్ట:—అనగా పర్వతముకంటెచిన్నదగురాతిప్రదేశము.

8. పర్వతపంక్తి:—అనగా చాల దూరమువరకు వ్యాపించి యుండు కొండలవరుస.

9. లోయ:—అనగా కొండలనడుమగాని గుట్టలనడుమగాని యుండు చదునైన పల్లపునేల.

10. అగ్నిపర్వతము లేక, జ్వాలాముఖి:—అనగా భూగర్భము నుండి అగ్ని, ధూమము, మరియు కరిగిన తదితర పదార్థ ములు వెలువడు శిఖరముగల కొండ.

11. పీఠభూమి:— అనగా ఎత్తైన చదును ప్రదేశము.

12. మైదానము:— అనగా చదునై విశాలముగా నుండు భూభాగము.

13. మహాసముద్రము:— అనగా ఉప్పు నీరుగల గొప్పజల భాగము.

14. సముద్రము:—అనగా మహాసముద్రముకంటె చిన్నదగు ఉప్పునీరుగల జలభాగము.

15. నౌకాశయ స్థానము (రేవు) అనగా—ఓడలు సురక్షితముగా నిలుచుటకు ఏర్పడిన సముద్రతీర భాగము.

16. తీరము:— అనగా సముద్రపు ఒడ్డు.

17. అగ్రము:—అనగా సముద్రము లోనికి దూరము వరకు చొరబడిన భూమియొక్క కొన.

18. అఖాతము:— అనగా భూమిలోనికి దూరము వరకు చొచ్చిపోయిన సముద్రశాఖ.

19. జలసంధి:—అనగా రెండు గొప్ప జలభాగములను కలుపు ఇఱుకైన నీటిమార్గము.

20. సరస్సు:—అనగా చుట్టు భూమిచే ఆవరింపబడిన నైసర్గిక జలభాగము.

21. చెరువు:— అనగా కట్ట కట్టి నింపిన జలభాగము.

22. నది:— అనగా సరస్సునుండిగాని పర్వతమునుండి గాని వెడలి లోయగుండ ప్రవహించి సముద్రములో పడు ప్రవాహము.

23. ఉపనది:—అనగా ఒక పెద్దనదిలో గలియు చిన్ననది.

24. కాలువ:— అనగా నదినుండి గాని చెఱువునుండి గాని త్రవ్వి తీయబడిన నీటిమార్గము.

25. అంతర్వేది:-అనగా రెండునదుల మధ్యనుండు మైదానము.

## ప్రశ్నలు.

1. ఖండ మనగానేమి? 2. ద్వీప, ద్వీపకల్పములకు గల భేద మేమి? 3. పర్వతమునకును గుట్టకునుగల వ్యత్యాస మేమి? 4. వీనినిగురించి వర్ణింపుడు - భూసంధి, పర్వతపంక్తి, సముద్రము. 5. వీని వ్యతిరేకములను నిర్వచింపుడు:— ద్వీపము, ద్వీపకల్పము, జలసంధి. 6. అఖాత మన నేమి? 7. నౌకాశయ స్థాన మని దేనికి పేరు? 8. సరస్సునకును, చెరువునకును గల తారతమ్య మేమి? 9. నదికిని ఉపనదికిని గల వ్యత్యాసమేమి? 10. అగ్ని మనగానేమి?

## విశేషనామ నిర్వచనములు.

1. పల్లెటూరు:—వ్యసాయకుటుంబములు కొన్ని నివసించు చిన్నయూరు.

2. గ్రామము:— పల్లెకంటె పెద్దదై 1000 కి మించిన జన సంఖ్యగల యూరు.

3. తాలూకా:—తహాసీల్దారు అధికారములో నుండు కొన్ని పల్లెలు, గ్రామములు గల భాగము.

4. డివిజన్:—రెండుమూడు తాలూకాలు కలిసినమండలము. ఇది సహాయ తాలుక్దారు అధికారముక్రింద ఉండును.

5. జిల్లా:— తాలుక్దారు అధికారమునకు లోబడిన కొన్ని డివిజనులు ఇమిడియుండు ప్రదేశము.

6. సూబ:—సుబేదారుపలుబడికింద నుండు కొన్ని జిల్లాలు కూడి యేర్పడిన ప్రాంతము.

7. ఖాల్సా, లేక దీవాని.—అనగా రాజుగారియొక్క రాజాధికారముకింద నుండు దేశము.

8. గైరుఖాల్సా:— దీవానీ పరిపాలనములో లేక, సర్ఫెఖాస్ జాగీరాతులకు సంబంధించిన ప్రదేశము.

## ప్రశ్నలు.

1. పల్లె యన నేమి? 2. పల్లెకును గ్రామమునకును గల భేదమేమి? 3. తాలూకా యని దేనిననెదరు? 4. డివిజన్ యన నేమి? 5. వీనిని వర్ణింపుడు-జిల్లా, ఖాల్సా 6. గైరుఖాల్సా యన నేమి?



# రెండవ భాగము.

## హిందూ దేశము

భూమి పూర్వార్ధ పశ్చిమార్ధ గోళములుగ విభజింపబడినదని మే మిదివరకు జెప్పియున్నాము. పూర్వార్ధగోళమం దున్న మహాఖండములలో ఆసియా యొకటి. ఈ మహాఖండము ప్రపంచమందలి స్థలభాగములోని రమారమి మూడవవంతు నాక్రమించుకొని యున్నది. దీనియందు సైబీరియా, రషియా, మంగోలియా, చీనా, తబ్బెతు, తుర్కిస్థానము, ఆఫ్గనిస్థానము, పారసీకము, అరేబియా, హిందూదేశము మొదలగు పెద్దపెద్ద దేశము లున్నవి. అన్నిటికంటె దక్షిణమున నున్న ముక్కోణాకారముగల ద్వీపకల్పమే మన దేశము. అనేకశతాబ్దములనుండి ఈ దేశములో హిందువులు నివసించుచున్నారు. కనుకనే దీనికి హిందూదేశము, లేక హిందూస్థాన మని పేరు దీనికి నుత్తరమున మహోన్నతములగు హిమాలయ పర్వతములు గలవు. హిమము అన మంచు. ఇది ఎత్తగు చల్లనిమంచుగడ్డలుగల పర్వతప్రదేశము. ఇచ్చటినుండియే బ్రహ్మపుత్ర, గంగ, యమున, సింధు, మొదలగు మహానదులు ఉత్పత్తియై మైదానములలో బ్రవహించుచున్నవి. మధ్యదేశములో వింధ్యపర్వతము లున్నవి. దీనికి నుత్తరమున నున్నదేశము ఉత్తరహిందూదేశ మనియు

దక్షిణదేశము దక్కను అనియు పిలువబడుచున్నది. ఈపర్వతములకు నిరుప్రక్కల నున్న మైదానములలో తపతి, నర్మదా నదులు పారుచున్నవి. దక్కనునకు తూర్పుతీరమున నచ్చటచ్చట తూర్పు కనుమలును పడమటి తీరమున నెత్తగు పడమటి కనుమలు నున్నవి. ఈకనుమలనుండియే గోదావరి కృష్ణా నదులు బయలుదేరు చున్నవి. పైజెప్పిన రెండు కనుమల మధ్య మిట్ట పల్లములు గల శిలామయ ప్రదేశము గలదు. ఇదే దక్కను పీఠభూమి. ఇది సముద్ర మట్టమునకు 1000 మొదలు 3000 అడుగుల వరకు ఎత్తుగా నున్నది. హైదరాబాదు రాజ్య మీపీఠభూమియందే కలదు. మన హిందూదేశమునకు తూర్పున హిందూమహాసముద్రముయొక్క యొక శాఖయగు బంగాళాఖాతమును పడమట అరేబియా సముద్రము నున్నవి తీరములందలి ముఖ్య నౌకాశయపట్టణములగు కలకత్తా, మదాసు, బొంబాయి, కరాచీలనుండి తూర్పున దూరదేశములగు బర్మా, జపానులతోను పడమట ఇంగ్లండు, అమెరికా దేశములతోను నౌకల మూలమున వర్తక వ్యాపారములు జరుగుచున్నవి.

ప్రపంచములో చీనాదేశమునకు తరువాత మనహిందూదేశములోనే ప్రజ లధికముగా నున్నారు. ఇతర దేశముల వలె మన దేశమందంతట నుండుప్రజలు ఒకజాతివారై యేక భాషనే మాటాడువారుకారు. చిరకాలమునుండి హిందువులు (బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, మొదలగు శాఖలు) ఇచ్చట నివసించుచున్నను దేశములోని నివాస

స్థానముల ననుసరించి వారు పంజాబీ, గుజరాతీ, బంగాలీ, తెలుగు, అరవము, మలయాళము మొదలగు భాషలను భాషించుచున్నారు. తురుష్కులు, పారసీకులు, ఆంగ్లేయులు ఈ దేశమునకు తరువాత వచ్చినవారు. వీరిలో సామాన్యముగ తురుష్కులు (ముసల్మానులు) ఉర్దూను, పారసీకులు గుజరాతీని, ఆంగ్లేయులు ఇంగ్లీషును వాడుదురు.

ప్రజలు ఇతర దేశస్థులవలె వ్యవసాయము, వర్తకము, కార్మికములు, ఉద్యోగపదవులు మొదలైనవి చేయుచున్నను అంత ధనవంతులు కారు. దీనికి ముఖ్యకారణము వర్తక వ్యాపారములలో ఎగుమతులకంటె దిగుమతి సామానులవెల హెచ్చుటయే. పూర్వ మొకప్పుడు మన దేశమే యితర దేశములకంటె ఎక్కువ ధనవంతమై వెండిబంగారములతో నిండియుండెడిది. ఇప్పుడు హిందూదేశమున కంతకు చక్రవర్తి జార్జి ప్రభువు. వీరు ఆంగ్లదేశీయులు. మన దేశమునకు మహారాణియై ప్రజల నందరిని బహుప్రేమతో బాలించిన విక్టోరియా వీరి పితామహియే. చక్రవర్తిగారు ఆంగ్లేయరాజ్యమునకు రాజధానియగు లండన్ లో నుందురు. హిందూదేశమునకు రాజధాని ఢిల్లీ. ఈ దేశము నేలుటకు చక్రవర్తిగారు తమ ప్రతినిధి (వైస్రాయి) నేర్పరచియున్నారు.

---

ప్రశ్నలు.

1. హిందూదేశము ఏమహాఖండమందున్నది ?

2. ఆసియాఖండమం దున్న కొన్ని దేశముల పేర్లు చెప్పుము.
3. హిందూదేశమునకు ఎల్లలేవి?
4. దేశమం దంతటను వాడబడుముఖ్యభాష లేవి?
5. హిందూదేశమునకు రాజధాని ఏది? చక్రవర్తి ఎవరు? వా రెక్కడ నుందురు?

---

# నిజాం రాజ్యము.

## నైసర్గిక స్వరూపము.

దక్కను పీఠభూమినిగురించి మీ కిదివరకే తెలిపితిమి. దీనిమధ్య నొకరాజ్య మున్నది. దీనినే హైదాబాదు, లేక నిజాంరాజ్య మనెదరు. హిందూదేశములోని స్వదేశరాజ్యము లన్నిటిలో నిది గొప్పదై ఘనతి జెందియున్నది. ఇది మనజన్మ భూమి; నివసించుదేశము. కనుక ప్రతివారికిని తమదేశమును గురించిన సంగతులు తెలిసియుండవలెను.

ఎల్లలు:—దీనికి ఉత్తరమున బరారు, ఖాన్దేసుజిల్లా లును; తూర్పున వరధా, గోదావరీ నదులును; దక్షిణమున కృష్ణాతుంగభద్రానదులును, మద్రాసుసూబాయొక్క కొన్ని జిల్లాలును; పడమట బొంబాయిసూబాలోని ధార్వాడ, బిజాపూర్, షోలాపూర్, అహమద్ నగర్ జిల్లాలు నున్నవి.

## నైసర్గిక స్వరూపము.

ఒకదేశముయొక్క వైశాల్యము మఱియొకదేశముకంటె భేదించియుండవచ్చును. హైద్రాబాదు రాజ్యము, ఔరంగా

బాదు జిల్లాలోని ఖండాల మొదలు ఒరంగలుజిల్లాలోని భద్రాచలము వఱకు 456 మైళ్ళపొడవును, అజంటాగుహాలు మొదలు రాయచూరుజిల్లాసరిహద్దగు కుప్పలువరకు సుమారు 384 మైళ్ల వెడల్పును నున్నది. మొత్తము 82,698 చదరపు మైళ్లవైశాల్యము కలదు.

## పర్వత పంక్తులు.

1. సహ్యాపర్వతములు :— ఇవి ఉత్తరపశ్చిమదిశలయందున్నవి. 2. బాలాఘాట్ పర్వతములు :— ఇవి గోదావరీ మంజీర నదులమధ్య తూర్పు పడమరలుగా వ్యాపించియున్నవి. నదులు వాయవ్యమూలనుండి ఆగ్నేయమూలకు ప్రవహించుటచే భూమియొక్కవాలుకూడ అటులనే యున్నట్లు తెలియుచున్నది. గోదావరీనది ఒకవైపు దూధన, పూర్ణ, ప్రాణహిత, మంజీర లను తనయుపనదులతో ప్రవహించుచున్నది. రెండవవైపు కృష్ణానది తనయుపనదులగు భీమా, తుంగభద్ర, మూసి, మున్నేరులతో ప్రవహించుచున్నది, మంజీరనదికి దక్షిణమునుండి కృష్ణానదివరకు ఒక గీత గీచిన యెడల నిజాంరాజ్యము భూభేద జాతిభేదముల ననుసరించి రమారమి రెండు సమభాగములుగ విభజింపబడుచున్నది.

ఒక భాగము వాయవ్యమున నున్నది. ఇచ్చట మహారాష్ట్రభాష వాడబడుటవలన దీనిని మహారాష్ట్రప్రాంతమనెదరు. ఇది సారవంతమైన ప్రదేశము. ఎత్తయిన చదునుగల తేమయారని నల్లరేగడి భూమి గలదు. పెద్దయడవులు తక్కువ. గొప్పచెఱువులును పెద్దబావులునుగూడ తక్కువయే. వర్షా

ధారమువలన వ్యవసాయ మగును. నల్లభూమి యగుటచే ప్రత్తి, గోధుమలు ఎక్కువగా పండును.

రెండవభాగము ఆగ్నేయమున నున్నది. ఇచ్చట తెలుగు మాట్లాడెదరు. కనుక తెలంగాన లేక తెలుగుప్రాంత మనబడు చున్నది. ఇది ఏటవాలుగా నున్న మిట్ట పల్లములు గల భూమి. ఎక్కువసారవంత మైనదికాదు. దట్టమైన పెద్దయడవు లున్నవి. వానిలో నడవిమృగము లనేకములు గలవు. ఈ తెలుగుప్రాంత మందున్న గుట్టలపై గుండ్రమైన పెద్ద పెద్ద రాతిగుండ్లొక దానిపై నొకటి దేవతలు పెట్టిరా యనునట్లు కనబడును. వీనిని జూచిన భయంకరముగా నుండును. గులకరాళ్లు గలిసిన ఇసుక నేల యగుటచే నీరినికిపోవును. కనుక బావులు, చెరువులు అనేకములు కలవు. వీనిసహాయమువలన వరిపైరు చక్కగా నగుచున్నది. పైన నుదాహరించిన యంశముల ననుసరించి తెలుగు, మహారాష్ట్రప్రాంతములకు గల తారతమ్యము లీదిగువ వివరించుచున్నాము.

| తెలుగు ప్రాంతము. | మహారాష్ట్ర ప్రాంతము. |
|---|---|
| 1. ఎక్కువగా తెలుగు మాట్లాడెదరు. | 1. ఎక్కువగా మరాఠి మాట్లాడెదరు. |
| 2. గుండ్రమైన పెద్దరాతి గుండ్లును, గుమ్మటమువంటి గుట్టలును కనిపించును. | 2. పర్వతపంక్తులును వంకరటింకరలుగ తీరిన గుట్టల వరుసలును కనిపించును. |
| 3. భూమి ఏటవాలు గలిగి మిట్ట పల్లములుగ నున్నది. | 3. భూమి ఎత్తై కొంచెము చదునుగా నున్నది. |




| | |
|---|---|
| 4. సస్యసమృద్ధి, సౌందర్యములు తక్కువ. | 4. సస్య[illegible], సౌందర్యము, [illegible] |
| 5. ఇసుకనేల యగుటచే నీరు త్వరగా నింకిపోవును. కనుక బావులు చెరువులు ఎక్కువగాగలవు. వరిపైరధికము. | 5. తేమగల రేగ[illegible] యగుటచే బావులును, చెరువులును ఎక్కువగా లేవు. ప్రత్తి, గోధుమలు పండును. |
| 6. దట్టమైన పెద్దయడవు లనేకము లున్నవి. | 6. దట్టమైన పెద్ద యడవులు తక్కువ. |

## ప్రశ్నలు.

1. హిందూదేశములో నిజాంరాజ్య మెక్కడ నున్నది?
2. ఈరాజ్యముయొక్క ఎల్లలేవి?
3. ఉత్తర హిందూస్థానమును దక్కనును వేరుపరచు పర్వతము లేవి?
4. మనరాజ్యమునం దేయేనదులు ప్రవహించుచున్నవి?
5. తెలంగాణాకును మహారాష్ట్ర ప్రాంతమునకును గల తారతమ్యము లెవ్వి?

## పర్వతములు.

నిజాంరాజ్యములోని ముఖ్యమైన పర్వతపంక్తు లివి:—

1. సహ్యాపర్వతపంక్తి:— ఇది ఆదిలాబాదు జిల్లాలోని నిర్మలునుండి వెడలి పర్భని, బరారు జిల్లాలగుండ అజంటా వరకు వ్యాపించి అచ్చట అజం[illegible] తరువాత పడమరవైపున ఖాందేశ జిల్లాలో ప్రవేశించినది.

ఈపర్వతపంక్తి నిజాంరాజ్యములో 250 మైళ్లపొడవున్నది.

2. బాలఘాటుపర్వతపంక్తి:—ఇది నాందేడుజిల్లాలోని బెలోలి తాలుకానుండి ప్రారంభమై పర్భనిజిల్లాలో ప్రవేశించి బీడుజిల్లాలోని అష్టియొద్ద అంతరించుచున్నది. ఇందలి యొకశాఖ అష్టినుండి వెడలి ఉస్మానాబాదు జిల్లాగుండ గుల్బర్గవరకు పోయినది. రెండవశాఖ నాందేడుజిల్లాలోని బెలోలికి తూర్పునుండి వెడలి దక్షిణపువైపు నిజామాబాదు జిల్లాలోని కోలాస్‌వరకు పోయినది. ఈపంక్తి యొక్క పొడుగు 200 మైళ్లు గలదు.

3. జాల్నాగుట్టలు:—ఇది ఔరంగాబాదుజిల్లాలోని దౌలతాబాదునుండి ఆరంభమై తూర్పున జాల్నాగుండ బరారులో చేరినవి. వీని పొడవు 120 మైళ్లు.

4. యామినీగడము:—ఇది రాయచూరుజిల్లాకు పశ్చిమమున 60 మైళ్లవరకు వ్యాపించినది.

5. కందకల్ గుట్ట, లేక సర్నాపల్లి పర్వతములు:—ఇవి వరంగలు జిల్లాకు ఈశాన్యమున 50 మైళ్లు వ్యాపించి ఆదిలాబాదు జిల్లాలోని చెన్నూరుకొద్ద అంతరించుచున్నవి.

6. రాఖీగుట్టలు:—ఇవి కరీంనగరుజిల్లాకు దక్షిణమున 30 మైళ్ల వరకు నున్నవి. ఈప్రాంతములో నొక యడవిజాతి నివసించుచున్నది.

## నదులు.

నిజాంరాజ్యములో నదులును, ఏరులును, 50 కంటె

ఎక్కువ గలవు. వానిలో ముఖ్యమైనవి:—

1. గోదావరి:—ఇది దక్కనులోని గొప్పనది. దీనిపొడవు 900 మైళ్లు. బొంబాయిప్రాంతమందున్న నాసిక దీనికి ఉత్పత్తిస్థానము. ఇది ఔరంగాబాదు, బీడు, పర్భిని, నాన్దేడు నిజామాబాదు, ఆదిలాబాదు, కరీంనగరు వరంగలు జిల్లాలలో ప్రవహించుచున్నది. దూధ్నా, పూర్ణా, పైనగంగా, వరధ, ప్రాణహిత అను ఉపనదులు ఉత్తరమున నుండియు, మంజీర, మానేరు అను ఉపనదులు దక్షిణమునసుండియు దీనిలో గలియుచున్నవి. ఈనది నిజాంరాజ్యములో దాదాపు 670 మైళ్లు ప్రవహించి తరువాత చెన్నపురిరాజధానిని దాటి బంగాళాఖాతములోపడు చున్నది. దీనిని హిందువులు పుణ్యనదిగా భావించెదరు.

2. కృష్ణానది:— ఇదియు గోదావరివలె పెద్దది. బొంబాయిప్రాంతమున ఉత్పత్తియై రాయచూరు జిల్లాగుండ ప్రవహించి మహబూబ్ నగర్ నల్లగొండజిల్లాలకు దక్షిణసరిహద్దుగా నేర్పడి చెన్నపురి రాజధానిని దాటి బంగాళాఖాతములో బడుచున్నది. దీనిపొడవు, 400 మైళ్లు. దీనిలో ఉత్తరమునసుండి భీమా, మూస, మున్నేరు అను ఉపనదులును; దక్షిణమునసుండి తుంగభద్రయు గలియును. గోదావరీ, కృష్ణా నదులు గుట్టలు మొదలైన రాతిప్రదేశములగుండ బహువేగముగ ప్రవహించుటచే ఓడల రాకపోకలకు వీలు లేదు.

3. మంజీర:—ఈనది బీడుజిల్లాలోని పాటోదయొద్ద ఉత్పత్తియై బీడు, బీదరు, మెదకు, నాన్దేడు, నిజామాబాదు

జిల్లాలగుండ ప్రవహించి గోదావరిలో గలియుచున్నది. ఇది 387 మైళ్ళ పొడవు గలదు.

4. పైన్‌గంగ:—బరారులోని దేవల్‌గడ్ గుట్టయొద్ద నుత్పత్తియై పర్భని, నాన్దేడు, ఆదిలాబాదు, జిల్లాలకు ఉత్తరమున ప్రవహించి వరధానదిలో గలిసి తరువాత ఆదిలాబాదు జిల్లాలోని చెన్నూరు సమీపమున గోదావరిలో పడుచున్నది. దీనిపొడవు 207 మైళ్ళు.

5. భీమా:—దీని యుత్పత్తిస్థానము పడమటి కనుమల సమీపమున పూనయై యున్నది. ఇది గుల్బర్గా, రాయచూరు జిల్లాలగుండ ప్రవహించి కృష్ణానదిలో సంగమించును. దీని పొడవు 175 మైళ్ళు.

6. తుంగభద్ర:—పడమటికనుమలనుండి బయలుదేరి రాయచూరు జిల్లాలగుండ ప్రవహించి అలంపురము సమీపమున కృష్ణానదిలో బడుచున్నది దీనిపొడవు 175 మైళ్లు.

చెఱువులు.

నిజాంరాజ్యములోని చిన్న పెద్ద చెఱువుల సంఖ్య దాదాపు 17, 000. వానిలో ముఖ్యమైనవి యివి:—

1. ఉస్మాన్ సాగర్:—ఈ చెరువు హైదరాబాదుకు పడమటివైపు 8½ మైళ్ళదూరమున మూసానది సమీపమున నున్నది. మూసానదికి వరదలు రాకుండుటకును, హైద్రాబాదు, సికిందరాబాదు పురవాసుల మంచినీటికొఱకును 1322 ఫసలీ క్రీ. శ. 1914) లో దీని పునాది వేయబడెను. చెరువున కున్న

రాతికట్ట 4,500 అడుగుల పొడవు గలది. ఈ చెరువు దాదాపు 6½ మైళ్ల పొడుగును 3 మైళ్ల వెడల్పును గలిగి 53 అడుగుల లోతు గలిగియున్నది. నీటివై శాల్యము 14⅓ చదరపు మైళ్లు.

2. హిమాయత్ సాగర్:—ఈచెరువు హైదారాబాదుకు నైర్‌ఋతిమూలయందు 6½ మైళ్ల దూరమున ఖరీజుఖాన్ సమాధి సమీపమున నున్నది. దీని రాతికట్ట 7,400 అడుగుల పొడవు కలదు. ఇది 93 అడుగుల లోతును, 9 చదరపు మైళ్ళ నీటి వైశాల్యమును గలిగియున్నది.

3. నిజాంసాగర్:—ఇది మెదకుజిల్లాలోని అచ్చంపేట సమీపమున నున్నది. దీనిని మంజీర నదికి 11,700 అడుగుల ఆనకట్ట కట్టి తయారుచేసిరి. ఇది 111 అడుగుల లోతును దాదాపు 50 చదరపు మైళ్ల వైశాల్యమును గలిగియున్నది. ఇది నిజాంరాజ్యములో నన్నిటికంటె పెద్ద చెరువు. దీనినుండి యొక కాలువ త్రవ్వబడెను.

4. పాఖాలచెఱువు:—ఇది వరంగలుజిల్లాలో పాఖాల తాలూకాయందున్నది. దీనికట్ట 2,000 గజముల పొడవు గలదు. చెరువు 8,000 గజముల పొడవును 6,000 గజముల వెడల్పును, సరాసరిలోతు 30 మొదలు 40 అడుగులవరకు నున్నది. ఇది నిండినప్పుడు 13 చదరపు మైళ్ళ వైశాల్యము కలిగియుండును. ఇది వరంగలు పాలించిన గణపతి దేవుని కాలమున ఆయన మంత్రి కుమారుడగు జగదాళముమ్మడయ్య త్రవ్వించినది. దీనిచుట్టు గుట్టలును, దట్టమైనపొదలును ఉండి సరస్సువలె కనబడుచున్నది.

5. రామప్ప చెరువు:—ఇది వరంగలుజిల్లాలో ములుగు సమీపమున నున్నది. నీటివైశాల్యము దాదాపు 9 చదరపు మైళ్ళు. ఈచెరువుక్రింద 9 వేల ఎకరముల భూమి సేద్యమగు చున్నది. దీనిని గణపతి దేవుని కాలమున రుద్రసేనాని కట్టించినాడు. ఈయన నిర్మించిన రామప్పగుడు లీచెరువు చెంత గలవు. చిత్రములకు పేరొందిన వీ యాలయములు.

6. లఖ్నావరపు చెరువు:—ఇది ములుగునుండి 13 మైళ్ళ దూరమున నున్నది. దీనినీటివైశాల్యము 8 చదరపు మైళ్ళు. దీనివలనదాదాపు 13 వేలఎకరములభూమి సేద్యమగుచున్నది.

7. హుసేన్ సాగర్:—ఇది హైదాబాదు సికంద్రాబాదు పట్టణముల మధ్యనున్నది. దీని రాతికట్ట 25,000 గజముల పొడవున్నది. చెరువు నిండినప్పుడు 8 చదరపు మైళ్ళ వరకు నీరు ఆక్రమించుకొనును.

8. మీర్ ఆలం చెరువు:—ఇది హైదరాబాదుపట్టణమునకు నైరుత్యమందున్నది. దీని నీటివైశాల్యము 8 చదరపు మైళ్ళు. దీనిరాతికట్ట దాదాపు 1,120 గజములపొడవున్నది.

## కాలువలు.

1. మహబూబ్ నహర్ కాలువ:—ఈకాలువ మెదకులో మంజీరానదినుండి త్రవ్వి తీయబడినది. 24½ మైళ్ళ పొడుగు గలదై ఘోనమ్మచెరువులో పడుచున్నది. అక్కడ నుండి మరల 37 మైళ్లు పొడిగింపబడి నిజామాబాదు జిల్లాలోని ఎల్లారెడ్డిగుండగూడ ప్రవహించుచున్నది.

2. ఫత్తైనహార్:—మెదకుజిల్లాలోని ఘనపురమునమీపమున మంజీరనుండి ఈకాలువ త్రవ్వి తీయబడినది. ఇది 11½ మైళ్ళపొడవు. దీనినీరు చెరువులకేగాక 6, 200 ఎకరముల సేద్యమున కుపకరించుచున్నది.

3. ఆసిఫ్‌నహారు:—ఇది భువనగిరియొద్ద నష్టుకల్వ గ్రామసమీపమున మూసానదినుండి తీయబడినది. దీనికి పూర్వము రాజుకాలువ యని పేరు. ఇది 57 మైళ్లు ప్రవహించి నల్లగొండలోని పానగల్లుచెరువులో పడుచున్నది.

4. గంగావతి కాలువ:—రాయచూరుజిల్లా గంగావతి తాలూకాలో తుంగభద్రనుండి రెండు కాలువలు త్రివ్వబడినవి. ఒకటి మెరకకాలువ. అది తన పిల్లకాలువలతో 12½ మైళ్ళ పొడుగు గలిగియున్నది. రెండవది పల్లపుకాలువ. అది తన పిల్లకాలువలతో 19 మైళ్ళ నిడివి గలిగియున్నది.

5. బేచలకాలువ:—ఇది రాయచూరు తాలూకా జోకోరునొద్ద తుంగభద్రానదియొక్క పూర్వపుకట్టనుండి తీయబడినది. 8½ మైళ్ళపొడవు గలదు.

5. నిజాంసాగర్ కాలువ:—ఇది నిజాంసాగర్ నుండి త్రివ్వి తీయబడినది. దీనిపొడవు 72½ మైళ్లు, వెడల్పు నూఱడుగులు. ఇది యెల్లారెడ్డి, బోధను, నిజమాబాదు తాలూకాలగుండ ప్రవహించి డిచ్పల్లి యొద్ద అంతరించుచున్నది. దీనినుండి మరికొన్ని పిల్లకాలువలు త్రివ్వబడినవి. అవి మొత్తమున 750 మైళ్ళపొడవు గలవు. 2,75,000 ఎకరముల భూమి సేద్యము కాగలదు.

## ప్రశ్నలు.

1. నిజాంరాజ్యములోని పెద్దపర్వతపంక్తు లేవి ?
2. వరంగలు కరీంనగరుజిల్లాలలో ఏపర్వతపంక్తు లున్నవి ?
3. గోదావరీనదియొక్క ఉత్పత్తిస్థానమెద్ది? దానియుపనదులేవి ?
4. కృష్ణానదియొక్క ఉపనదులు పేర్కొనుడు.
5. హైదరాబాదు సికందరాబాదు పురవాసులు ఏచెరువునీరు త్రాగుచున్నారు.
6. సేద్యమున కాధారములైన చెరువులలో ముఖ్యము లెవ్వి ?
7. మనరాజ్యములో ఏయే పెద్దకాలువలు గలవు ? అవి ఎక్కడ నుండి తీయబడినవి ?

## శీతోష్ణాదులు:—

శీతోష్ణాదిస్థితి దేశముయొక్క ఋతుభేదములను, ఆరోగ్యస్థితులను దెలుపును. ఏదేని యొక్క ప్రదేశపుశీతోష్ణస్థితి కనుగొనవలె నన్న ఈదిగువ యంశములను గమనింపవలయును.

1. శీతోష్ణములు 2. ఋతుపవనములు 3. వర్షము.

1. శీతోష్ణములు:—భూమధ్యరేఖకు సమీప ప్రదేశములు ఎల్లప్పుడును ఉష్ణముగా నుండును. నిజాం రాజ్యము ధ్రువములకు దూరముగ నుండి, భూమధ్య రేఖకు కొంచెము సమీపమున నున్నది. కాబట్టి ఉష్ణ మధికముగ నుండదగి యున్నది. కాని యీప్రదేశము సముద్రపు మట్టమునకు 1250 మొదలు 2500 అడుగుల వరకు ఎత్తుగ నున్నది. కనుక ఇచ్చట సంవత్సరముపొడుగునను సమశీతోష్ణముగ నుండును.

2. ఋతుపవనములు:—నిజాంరాజ్యములోనివి వేసవి కాలాంతమున నైరృతిమూలనుండి వీచుచుండును. ఆవిరితో నుండినయీగాలిమన దేశమందు వానలు కురియునట్లుచేయును. శీతకాలమందుగూడ ఈగాడ్పులు ఈశాన్యముననుండి వీచుచుండును. కాని మనరాజ్యమందివి చినుకులదప్ప పెద్దవర్షముల గురిపించవు. నిజాంరాజ్యములోని రెండుప్రాంతముల యందు శీతోష్ణస్థితులు ఒకదాని కొకటి కొంచెము భేదించి యున్నవి. తెలుగుప్రాంతములో చెఱువు లధికముగ నుండుటచే గాలి తడిగాను దీనికి వ్యతిరిక్తముగ మహారాష్ట్రప్రాంతములో తక్కువ చెఱువు లుండుటవలన గాలి పొడిగా నుండును. మొత్తమున రాజ్యమందంతట సమశీతోష్ణముగ నుండును. ఇచ్చట సంవత్సరములో మూడుఋతువులు గలవు. 1. వర్షఋతువు 2. శిశిరఋతువు 3. గ్రీష్మఋతువు. వర్షఋతువు అమర్దాద్‌లో ప్రారంభించి ఆబాను నెలాఖరు వరకును, శిశిరఋతువు ఆజుర్ మొదలు ఇస్ఫందారు నెలాఖరు వరకును, గ్రీష్మఋతువు ఫర్వర్దినుండి తీరు నెలాఖరు వరకును నుండును.

3. వర్షము:—ఎండవేడిమికి సముద్రపు నీరు ఆవిరియై పైకి లేచును. నైరృతి మూలనుండి వీచు గాలి ఈయావిరిని హిందూదేశమునకు తీసికొని వచ్చును. అప్పుడా యావిరి పడమటికనుమలకు దాకి అచ్చటనే ఎక్కువ వర్షము కురిసి పోవును. కనుక మన దేశములో వర్షము బహు తక్కువ.

మహారాష్ట్రమునకంటె తెలింగానలో అడవు లధికమగు

టచే వర్ష మెక్కువ. తెలింగానలో సంవత్సరమునకు 32 ఇంచులును మహారాష్ట్రములో 28 ఇంచులును వర్షము కురియును. దీని కర్థమేమన సంవత్సర మంతయు కురిసిన వర్షము భూమియందింకక మరియు ఆవిరిరూపమున ఎగిరిపోకుండను నుండిన యెడల భూమిమీాద 32 ఇంచుల నీరుండు ననుట.

భూమి - పంటలు.

మహారాష్ట్రప్రాంతమందు మూడువిధముల భూములున్నవి. 1. నలుపు, 2. ఎరుపు. 3. మిశ్రమభూమి.

ఈప్రకారమే తెలుగుప్రాంతమందుకూడ 3 విధముల భూము లున్నవి.

1. నలుపు, 2. ఎరుపు, 3. ఇసుకగలిసినభూమి

మరాఠి వాడి భూములు తెలింగానలోకంటె ఎక్కువసారవంతములైనవి. అక్కడ పెద్దపంటలు తోలకరి, పునాస, అని రెండు. కాని తెలింగానలో తోలకరి, పునాస, మాగాణి, మెట్టయను నాలుగుతీరులపంటలు పండింతురు.

ఇదిగాక రెండుప్రాంతములందును ఆకుకూరలు, కాయగూరలు, పండ్లు మొదలగు తోటపంటలు కొద్దిగా పైరగుచున్నవి. మనదేశములో నున్న ప్రజలు సాధారణముగ వ్యవసాయము చేసి జీవింతురు. పురాతనపద్ధతిప్రకారమే సేద్యము చేయుటచే రైతులు వృద్ధిపొంద లేకున్నారు. ఇటీవల వ్యవసాయశాఖవారు అచ్చటచ్చట వివిధసస్యములను నూతనపద్ధతిగ పండించుటకు అనేకపరిశోధనలు జేసి అనుభవము సంపా

దించుటకు ప్రయత్నించుచున్నారు. అట్టి ప్రదేశములు ఈ క్రింద నుదాహరింపబడుచున్నవి.

1. పర్భనిలో స్వచ్ఛగోరాని ప్రత్తిపైరు వృద్ధి పర చుటకు ప్రయత్నించుచున్నారు.

2. కామరెడ్డిలో చెఱకుపైరును వృద్ధిపరచుచున్నారు.

3. ఆలేరులోని చవుడుగల భూములందు చెఱకు, పొగాకు, ఆముదములు, కంబోడియాప్రత్తి పైరుచేసి సఫలులైరి.

4. మహబూబ్ నగరములో కంబోడియా ప్రత్తిని మెట్టపంటగాను మాగాణిపంటగాను పైరు చేయుచున్నారు. మరియు పట్టుపురుగుల కాహారమగు ఆముదపుచెట్లు కూడ పెంచబడుచున్నవి.

5. ఉప్పలులో ఎముక ఎరువు వలని లాభములు చూపుచున్నారు.

6. సంగారెడ్డిలో తోటపైరులు వృద్ధిచేయు మార్గములు పరిశీలింపబడుచున్నవి.

ఉపయోగమును బట్టి మనరాజ్యములోని యుత్పత్తులు రెండువిధములు.

1. ఆహారపదార్థములు. 2. తదితర పదార్థములు. బియ్యము, మొక్కజొన్న, గోధుమలు, జొన్నలు, కొఱ్ఱలు, సజ్జలు, రాగులు, పెసలు, మినుములు, కందులు, చెఱకు, ఇవి రెండు ప్రాంతములందును; గోధుమలు ఎక్కువగా మహారాష్ట్రమందును బియ్యము ముఖ్యముగా తెలంగానలోను పండును.

కూరలలో వంగ, బీర, బెండ, ఆనప, కాకర, మొదలగు కాయ లును చేమ, చిలగడ మొదలగు దుంపకూరలును తోట, గోగు, పాల మొదలగు ఆకుకూరలును పైరగుచున్నవి.

ఫలములలో మామిడి, జామ, రేగు, నేరేడు, సీతా ఫలములు సమృద్ధిగను, పుచ్చ, వెలగ, అత్తి, అరటి, నారింజ, కమలాఫలములు కొద్దిగను దొరకును. హైద్రాబాదు అంటు మామిడిపండ్లకును, మైసరంచావుని అంజీరుపండ్లకును, గుల్బర్గ అరటిపండ్లకును, దౌలతాబాదు అంజీరు ద్రాక్ష పండ్లకును, ఔరంగాబాదు జామ, రేగుపండ్లకును, జాల్న కమలాఫలముల కును, అలంపురము పుచ్చజాతికిని ప్రసిద్ధి జెందినవి.

తదితరదినుసులలో ప్రత్తి, నార, పొగాకు, నీలి అన్ని ప్రదేశము లందును, ప్రత్తి ముఖ్యముగ మహారాష్ట్రమందును పైరగుచున్నది. నూనె దినుసులలో నువ్వులు, కునుమ, ఆముదములు, అవిసె, వేరుసెనగలు గలవు. వీనిలో అవిసె మహారాష్ట్రమందును ఆముదములు, నువ్వులు తెలంగాన లోను ఎక్కువగ పైరగుచున్నవి.

## అ ర ణ్యా ము లు .

నిజాంరాజ్యములోని యడవులలో పలువర్గముల వృక్ష జాతులు కనిపించుచున్నవి. ఈత, తాటివర్గము విశేషము. తెలం గానలో వీనినుండికల్లుదీసి త్రాగుదురు. చింతచెట్లు తెలంగానలో ప్రతిచోట గలవు గాని మహారాష్ట్రప్రాంతమున తక్కువ. నిజాం రాజ్యమునందువరంగలుఆదిలాబాదుకరీంనగరు నిజామాబాదు

ఔరంగాబాదు, జిల్లాలలో మాత్రము గొప్పయడవు లున్నవి. వీనినుండి వివిధములగు పనులకు కలప లభించుచున్నది. టేకు, పసుపుమాను, ఖేరుమాను, వీనికలప అన్ని యడవులలోను టేకు వరంగలు, మహబూబ్ నగరు, ఆదిలాబాదుఅడవుల లోను; ఆబ్నూసు కరీంనగర్ నిజామాబాదులోలను, జిట్రేగు మహబూబ్ నగరులోను, సాటిన్ మహబూబ్ నగరు లకి శెట్టి పేటలోను దొరకును. ఈకలప యిండ్లకును, యిండ్ల సామాను లకును పనికివచ్చును.

కరక, తంగేటి బెరడులనుండి రంగులు తయారుచేయు దురు. ఇవిగాక తవక్షీరి, టస్సను, తేనె, మైనము, లక్క, జిగురు, రోస మొదలగు నితర ఉపయుక్త వస్తువు లీ యడవు లందు లభించును. కరీంనగరు వరంగలు మహబూబ్ నగరు నిజామాబాదు జిల్లాలలోని యడవులలో నల్లమద్దిచెట్లపైన టస్సరుపురుగులు ప్రబలుచున్నవి.

గోదావరీనదికి సంబంధించిన యడవులలో లక్క ఎక్కు వగా దొరకును. మెదకుజిల్లాలో రోసాగడ్డినుండి ఒకవిధమైన ద్రవము తీయుదురు.

అరణ్యములవల్ల సర్కారువారికి గొప్పరాబడి యగును. కనుక అరణ్యములను బహుజాగ్రతగా కాపాడెదరు. దీనికొర కొక శాఖ యేర్పడి యున్నది.

## ప్రశ్నలు.

1. శీతోష్ణాదిస్థితుగలన నేమి?

2. ఋతువు లెన్ని ? మనరాజ్యములో వాని నియమిత కాలములను దెలుపుడు?

3. మన రాజ్యములో వ్యవసాయస్థితి ఎట్లున్నది ?

4. మన దేశములో ఏయే పరిశోధనలు ఎక్కడెక్కడ జరుగుచున్నవి ?

5. దట్టమైనయడవులు మనరాజ్యములో ఎక్కడెక్కడనున్నవి?

6. మనయడవులలో నేయేకలప పెరుగుచున్నది ?

7. అడవులలో కలపగాక మఱేయుపయుక్త పదార్థములు దొరకును ?

## ఖనిజవర్గము.

నిజాం రాజ్యములో ఖనిజము లనేకములు గలవు. ఇవి యింకను ఎక్కువగా తీయబడలేదు. భూగర్భమందే పడియున్నవి. దీనికి కారణ మేమనగా ప్రజలు వర్తకమును నిర్లక్ష్యముచేసి వ్యవసాయముచే జీవించుచున్నారు. అయినను రాయి, బొగ్గుగనులందు పని చక్కగా జరుగుచున్నది.

నేలబొగ్గు:—వరంగలు జిల్లాలోని సింగరేణిలో ఎక్కువ బయలుదేరుచున్నది. ఆదిలాబాదు, చెన్నూరు, ఆసిఫాబాదు, లక్సెట్టిపేట, రాజూర తాలూకాలలోగూడ కనబడుచున్నది.

పరపురాయి (నేలు):—ఇది యిండ్లలో నేలమీాద పరచుటకును, ఇండ్లకప్పులకును, సిమెంటుచేయుటకును, గుల్బర్గ జిల్లాలో తాండూరు, చించోళి, సిడము, నావడ్గి, చితాపూరు, వాడి. షాబాదు ప్రదేశములలో నిది ఎక్కువగ బయలుదేరు

చున్నది.

గ్రాఫాయిటు:—ఇది పెన్సిలు చేయుటకు పనికి వచ్చును. వరంగలుజిల్లాలోని పాలవంచలో దొరకును.

రాగి:—దీనిగని నల్లగొండ జిల్లాలోని చింతరేలయొద్ద కనిపించుచున్నది.

ఇనుము:—దీనిగనులు గుల్బర్గ, వరంగలు, ఆదిలాబాదు కరీంనగరు మెదకు జిల్లాలలో నున్నవి. ఆదిలాబాదు జిల్లాలోని యల్లడపువద్ద ఉత్తమమైన యినుము కనిపించుచున్నది.

అభ్రికము:— దీనిగనులు ఖమ్మము, పాలవంచ, సూర్యాపేట, ఊటూన్నరు తాలూకాలలోను, రాయచూరు జిల్లాలోను ఉన్నవి.

హొటాసు:—చర్మములను శుభ్రపరచుటకు పనికివచ్చును. లింగసుగూరు తాలూకాలో నూరజ్వారు గ్రామస్థులు చవుడును నీళ్లలో కలిపి ఈ ఉప్పును తయారు చేయుదురు.

సుద్ద:—బీదరు, మహబూబ్ నగరు, పాలవంచ తాలూకాలలో నున్నది.

జేగురు:— బీడు, చించోళి, బీదరు, పాలవంచ, పాఖాల తాలూకాలలో దొరకును.

జలపము:— సిద్దిపేట, ఖమ్మము, మధిర, పరకాల, నిర్మలు తాలూకాలలో నున్నది.

బంగారము:— ఇది లింగసుగూరు తాలూకాలోని హట్టియొద్ద దొరకును.

## జంతువర్గము.

నిజాంరాజ్యముయొక్క రెండు ప్రాంతములలో ముఖ్యముగ తెలంగానయొక్క గొప్పయరణ్యములలో నానాజాతుల మృగములున్నవి. వీనిలో పెద్దపులి, చిరుతపులి, సివంగి, అడవి పంది, తోడేలు, అడవిమేకలు, కోతులు, ఎలుగుబంట్లు, నక్కలు, అడవిదున్నలు మొదలైనవి తరుచుగా వరంగలు ఆదిలాబాద్ అడవులయందు కనిపించును. కొందరు వేటాడు నపేక్షతో దూరప్రదేశమునుండి యిక్కడికి వత్తురు. ఉన్నతప్రదేశములందు కణుజు, మనుబోతు, దుప్పి, లేడి, మొదలైనవి కనబడును. పక్షులుకూడ అనేకములు గలవు. తీతువు, కౌజు, పావురము, పికిలిపిట్ట, చిలుక, గోరువంక, కోకిల, అడవి పావురము, అడవికోడి, నీటికోడి, పెద్దబాతు, పొట్టిబాతు, నెమలి, జెముడుకాకి, డేగ జాతులు మొదలైనవి గలవు. గోదావరి, కృష్ణా నదులతీరములందు నీటిపక్షులు కనిపించుచుండును. పూర్వము దక్కను గుఱ్ఱములకు ప్రసిద్ధి - ముఖ్యముగా గోదావరిభీమా నదీప్రాంతములం దుండు గుఱ్ఱములు బలిష్ఠములై వేగవంతములై యుండెను. అరేబియా ఆస్ట్రేలియా గుఱ్ఱములు దేశములోరా నారంభించగా వీనిని కోరువారు లేరైరి. తూర్పు తెలంగానలో శ్రేష్ఠమైనఎడ్లు దొరకును. ముఖ్యముగ అమ్రాబాదు, దేవరకొండ, సూర్యాపేట, ఖమ్మము, మధిర, ఆదిలాబాదు ఎడ్లు శ్రేష్ఠములైనవి. ఆదిలాబాదు, మధిరయొక్క గేదెలు ఎక్కువ పాలిచ్చును. మహారాష్ట్రప్రాంతమున నొకేజాతి గొర్రెలు,

మేకలుమాత్రమే కనిపించును. కాని తెలంగానలో అనేక జాతులు గలవు. గోదావరి, కృష్ణ, తుంగభద్రానది ప్రాంతము లందు పెద్దజాతి గొర్రెలు, మేకలు కనిపించుచున్నవి. హింగోళిలో సర్కారువారు పశుసంతానాభివృద్ధికొరకు పశుశాల యొకటి యేర్పరచి మంచిగుఱ్ఱములను, ఎడ్లను తయారుచేసి రైయితుల కిచ్చుచున్నారు.

కార్మిక పరిశ్రమలు:—

ఇవి రెండువిధములు. చేతులతో చేయబడినవానికి కర కార్మికములనియు మరలతో చేయబడువానికి యంత్ర కార్మికము లనియు పేర్లు. ఈకార్మికములకు వస్తుభండారము అవసరము. అది మనదేశములో చాల గలదు. ప్రత్తి ఎక్కువగ పైరగుచున్నది. నూనెదినుసు లనేకములు గలవు. అడవులలో ఓకుకలప సమృద్ధిగ గలదు. అయినను ప్రజలి కార్మికములకు పూనుకొనుటలేదు. సేవావృత్తియందు ఎక్కువ యిచ్ఛ గలవారై యున్నారు. కనుకనే దేశములో సంపద వృద్ధిపొందక యున్నది. దేశమునం దంతటను పైజెప్పిన పరిశ్రమలకు వలయు సామగ్రు లున్నవి. ప్రతిగ్రామములోను వడ్రంగులు, కమ్మరులు, సాలెవాండ్రు, కుమ్మరు లున్నారు. వడ్రంగులిండ్లు కట్టుదురు; నాగళ్లు మొదలైనవి తయారుచేయుదురు. కమ్మరులు ఇనుపసామానులు వ్యవసాయపు పనిముట్లు చేయుదురు. కుమ్మర్లు కుండలు చేయుదురు. సాలెవాండ్రు వస్త్రములు నేయుదురు.

రెడ్డిపేటలలో పీతాంబరములు, జలతా రంచుగలకోకలు మంచి పట్టువస్త్రములు నేయుదురు. హిమ్రూ, మషరూ, కంఖాబు మొదలగు పట్టుతానులు ఔరంగాబాదులో మంచివి తయారగును. నారాయణపేట పట్టుకోకలకు ప్రసిద్ధి, షోలాపూరు, షాపూరు, కొడంగలు (గుల్బర్గజిల్లా) కుష్టిగి (రాయచూరుజిల్లా) లో నూలుతోను, పట్టుతోను, మంచికోకలు నేయబడును. వరంగలు, మట్టెవాడ, హనుమకొండ (వరంగలుజిల్లా) కోసిగి (గుల్బర్గజిల్లా) నారాయణపేట (మహబూబ్ నగరు జిల్లా) మహాదేవపురము (కరీంనగరుజిల్లా,) ఆర్మూరు (నిజామాబాదుజిల్లా)లలో టస్సరుబట్టలు మంచివి తయారగును. దేవరకొండ, పోచంపల్లి (నల్లగొండజిల్ల) హనుమకొండ [వరంగలుజిల్లా] లలో తేలియారుమాళ్లు మంచివి నేయబడును. మద్దూరు (గుల్బర్గజిల్ల) లుంగీలకు ప్రసిద్ధి. మృదువైన సన్నకంబళ్లు మక్తలు, అమ్రాబాదు, నాగర్ కర్నూలు, దేవరకదర (మహబూబునగర్ జిల్లా) గడికేసివారు, చించోళి, సుల్తాపేట (గుల్బర్గజిల్లా) లలో తయారగును. మట్టెవాడ తివాసీలకు ప్రసిద్ధి. మానకొండూరు, కరీంనగర్ లలో వెండితీగతో విచిత్రములైన వస్తువులు చేయుదురు. బీదరులో నానాలోహమిశ్రములతో గుండీలు, హుక్కాలు మొదలైనవి తయారుచేసి వెండి, బంగారుగిల్టును పూయుదురు. సిద్దిపేట [మెదకుజిల్లా] పెంబర్తి (నల్లగొండజిల్లా) లింగంపేట (నిజామాబాదుజిల్లా) లలో ఇత్తడిసామానులును; దౌలతాబాదు, వరంగలు, కోయలకొండ, కోరట్ల, గూడూరు మద్దూరులలో కాగిత

ములును, ఫర్నిచరు (కుర్చీలు, మేజులు మొ॥) హైదారాబాదు మరి కొన్ని జిల్లాలలోను నిరుపమానముగ తయారగును.

యంత్రకార్మికములు:—

1 ప్రత్తిని చక్కజేసి బట్టలు నేయు కర్మాగారములు:-

నిజాంరాజ్యములో ప్రత్తి విస్తారముగ పైరగుచున్నది. ఇక్కడ వస్త్రములు నేయు కర్మాగారములు ఏర్పరచుటకు మంచి అనుకూలము లున్నను ప్రజలు శ్రద్ధవహింపరు. ప్రస్తుతము ప్రత్తిని శుభ్రపరచుటకును బస్తాలుగ నదిమికట్టుటకును వస్త్రములు నేయుటకును మొత్తము 99 కర్మాగారము లున్నవి. ఇవి తెలంగానకంటె మహారాష్ట్రప్రాంతమం దెక్కువగా నున్నవి. ఆప్రాంతమం దున్న ప్రత్తిపంటయొక్క ఆధిక్యమే దీనికి కారణము.

దూదిబట్టలు, పట్టుబట్టలు తెలంగానలో కూడ నేయబడుచున్నవి; ముఖ్యముగా మహబూబ్ నగరు, వరంగలు జిల్లాలలో అముదపు చెట్లెక్కువ. వానియాకులు పట్టుపురుగులకు మంచిఆహారము గనుక ఈ ప్రాంతములందు పట్టుకర్మాగారము లేర్పరచుట కనుకూలము.

వస్త్రములునేయు కర్మాగారములు రాజ్యమం దంతటను 6 మాత్రమే గలవు. హైద్రాబాదుపట్టణములో రెండు; వరంగలు, నాన్దేడు, ఔరంగాబాదు, గుల్బర్గాలలో ఒక్కొక్కటి. వీనిలో నాన్దేడులో నున్నది చాలపెద్దది. వీనికి ఉస్మాన్షాహి మిల్సు అని పేరు. ఆవిరిబలముచే యంత్రములు నడుపబడుచున్నవి. పట్టువస్త్రములు చేతిమగ్గములతో తయారగుచున్నవి.

2. సర్కారు కర్మాగారములు:—

ఈదిగువ నుదాహరించిన కర్మాగారములు వారి స్వాధీనములో నున్నవి. 1. ఆల్కహోలు కర్మాగారము 2. బట్టలు నేయు కర్మాగారములు 3. శోధనాగారము. ఆల్కహోలు కర్మాగారము కామారెడ్డి స్టేషనుకు కొంత దూరమున తేకిర్యాలయందు స్థాపింపబడియున్నది. వస్త్రనిర్మాణ కర్మాగారము హైదరాబాదులో నున్నది ఇచ్చట దూది, పట్టువస్త్రములను మగ్గములలో తయారు చేయించి అమ్మెదురు.

పరిశోధనాలయము:—ఇచ్చట వివిధవిషయముల పరిశోధనలు చేయబడును. ఇంతవరకు సరీషు అను జిగురుపదార్థమును, కల్లునుండి బెల్లము తయారు చేయుటయందును మాత్రము కడతేర గలిగిరి. లక్కపనులు, తోలు పదును పెట్టు విద్యలు నేర్చుటకై కొందరు విద్యార్థులను పరదేశములకు పంపియున్నారు. వారు తిరిగి వచ్చినతరువాత ఆకర్మాగారములను కూడ నిర్మింతురు.

3 పిష్టకర్మాగారములు:—సాధారణముగ తిరుగళ్లతో పిండి విసరుచున్నారు. ఇప్పుడు క్రమముగ పిండి విసురు యంత్రముల నుపయోగింప నారంభించియున్నారు. ఇవి హైద్రాబాదు పట్టణమున వీథివీథి కనేకములు గలవు గాని జిల్లాలయందు బహుతక్కువ.

4 నూనెయంత్రములు:—తెలంగానలో నూనె దినుసుల పైరెక్కువ గనుక యంత్రములతోగాని గానుగలతోగాని

నూనెతీయు కర్మాగారములు మహారాష్ట్ర ప్రదేశములో కన్న హెచ్చుగా నున్నవి.

5 ఇతరకర్మాగారములు:— ఇవిగాక హైదరాబాదులో రెండు యినుప కర్మాగారము లున్నవి. హైదరాబాదు, దాని చుట్టుపట్లలో సిగరెట్లు, గాజు సామానులు, అగ్గిపెట్టెలు, పెంకులు, సబ్బు తయారుచేయు కొన్ని కర్మాగారములు, మరియు చర్మములను శుభ్రపగచునవి, షాబాదులో సిమెంటు తయారుచేయు కర్మాగారములు కూడ నున్నవి.

## ప్రశ్నలు.

1. నేలబొగ్గు, ఇనుము, పొటాసు గను లెక్కడెక్కడ గలవు?
2. రాగి, బలపము, బంగారుగనులు ఎక్కడ కనిపించుచున్నవి?
3. శ్రేష్ఠములైన ఎడ్లు, గేదెలు ఎక్కడ దొరకును?
4. పీతాంబరములు, హింరూ, పట్టుకోకలు, తివాసీలు, వెండితీగ వస్తువులు మనరాజ్యములో ఎక్కడెక్కడ దొరకును?
5. షోలాపూరు, హానర్పర్తి, బీదరు, పెంబర్తి ఏయే చేతిపనులకు ప్రసిద్ధి?

## వర్తక వ్యాపారములు.

వస్తువులను ఒకరి కొకరు అమ్మ్మట వర్తక మనబడును. పరదేశములనుండి మనదేశమునకు దూది, ఉన్ని వస్త్రములు, యంత్రములు, గాజుసామానులు దిగుమతి యగుచున్నవి. వీనికి ప్రతిఫలముగ ఇక్కడనుండి దూది, నూనెదినుసులు ఎగుమతి యగుచున్నవి. ఇట్లు వస్తువుల నిచ్చి పుచ్చుకొను వృత్తిగలవారు వణిజులు లేక వర్తకు లనబడుదురు.

పల్లెటూర్లలోకూడ వర్తకము జరుగుచున్నది. కాని బహుతక్కువ. కుమ్మరి తాను చేసిన కుండలను కొన్నిరూపాయలకు అమ్మి, వానితో దనకొరకు ధాన్యమును, వస్త్రములను కొనుచున్నాడు. దాని యర్థమేమన తాను చేసిన కుండలకు ప్రతిఫలముగ ధాన్యమును, వస్త్రములను పొందుచున్నాడు.

వర్తకములు రెండువిధములు. 1. అంతర్దేశ వర్తకము. 2 దేశాంతర వర్తకము. తమదేశములోనే ఒకరితోనొకరు చేసికొను వర్తకము అంతర్దేశవర్తకము. తమదేశమునుండి సరకులు పరదేశములకు పంపి దానికి ప్రతిఫలముగ పరదేశ సరకులను కొనుట దేశాంతర వర్తకము. వర్తకపుసరకులను ఒక స్థలము నుండి యితర స్థలములకు పంపుటకు ఎడ్లు, బండ్లు, రైళ్లు అవసరములు. వీనికొరకు మంచిబాటలు కూడ కావలయును. నిజాం రాజ్యముయొక్క వర్తకము దక్కను, ఉత్తర హిందూస్థానము, రంగూను, సీమతో నగుచున్నది. ఎగుమతి, దిగుమతి సరకులపై కరోడ్గిరి అను పన్ను తీసికొనబడును. దీనికొరకు పెద్దపెద్ద వర్తక స్థలములలోను సరిహద్దులలోను కరోడ్గిరి ఆఫీసులు కట్టియున్నారు.

దిగుమతివస్తువులు:— దారము, ఉన్ని బట్టలు, పట్టువస్త్రములు, ధాన్యములు, ఉప్పు, పంచదార, ఎండిన పండ్లు, పోకలు, వెండి, బంగారము, రాగి, యిత్తడిరేకులు, పాత్రలు, ఇనుము, గ్యాసునూనె [కెరోసైన్], నల్లమందు, యంత్రములు, మొదలైనవి.

ఎగుమతివస్తువులు:—ధాన్యములు, ప్రత్తి, నూనెగింజలు, ఇండ్లకలప, తోళ్ళు, పశువులు, బొగ్గు మొదలైనవి.

## రాకపోకల సాధనములు.

నిజాంరాజ్యపు అంతర్దేశ, దేశాంతర వాణిజ్యములగూర్చి మీరిదివరకే చదివియున్నారుకదా. వర్తకపు సరకులను తీసికొనిపోవుటకు కంకరరోడ్లు, రైలుమార్గములు అవసరములు. సరకులు సామాన్యముగ 1 ఎడ్లపైనను 2 బండ్లపైనను 3 రైలుమీదను తీసుకొనిపోబడును. దీనికొఱకు నిజాంరాజ్యములో మంచి పెద్దబాటలు గలవు. ఇవి ఒకజిల్లాను మరియొక జిల్లాతో, ఒకతాలూకాను మరియొకతాలూకాతో కలుపుచున్నవి. ఈబాటలపై రాత్రింబవళ్ళు వందలకొలది బండ్లు మోటార్ల మూలమున ప్రయాణికులయొక్కయు సరకులయొక్కయు రాకపోకలు జరుగుచున్నవి. బయట అనగా బార్సి, షోలాపూరు, అహమదునగరు, కర్నూలు, ఆదోని, బళ్లారి, జగ్గయ్యపేట, బెజవాడనుండి నిజాంరాజ్యములోనికి వర్తకపు సరకులు తరచుగా రోడ్లద్వారా ఎడ్లపైనను బండ్లపైనను వచ్చుచున్నవి. ఈరోడ్లు రెండువిధములు. మొఱమురోడ్లు, కంకర రోడ్లు. ప్రయాణముకొరకును వర్తకముకొరకును ననుకూలమైన రైలుమార్గము. దీనిద్వారా బొంబాయినుండి యెక్కువగాను మదరాసు ప్రాంతమునుండి కొద్దిగాను సరకులు దిగుమతి యగుచున్నవి. గ్రామాంతరములందు ఉత్పన్నములగు సరకులు అక్కడక్కడ ప్రోగుచేయబడి సమీపమందునను

గొప్ప వర్తకస్థలములకు గాక రైలు స్టేషనులకును ఎగుమతి చేయబడుచుండును. మనదేశమునందు వ్యవసాయము ఎక్కువ. వర్షములు కురియనిచో ఆయా ప్రదేశములందు కఱవు సంభవించును. అటువంటి సమయమున నట్టి ప్రదేశములకు రైలు మార్గముద్వారా ధాన్యములు పంపించబడును. నిజాంరాజ్యములో ప్రస్తుతము నడుచుచున్న రైలుమార్గము లివి:—

1. జి. ఐ. పి. రైలు (వెడల్పు) మార్గము 2. ఎం. అండ్. ఎస్. ఎం. రైలు (వెడల్పు) మార్గము 3. బార్సిలాయిటు రైలు (ఇరుకు) మార్గము 4. ఎన్. ఎస్. రైలు (వెడల్పు) మార్గము 5. హైదరాబాదు గోదావరివ్యాలి రైలు (చిన్న) మార్గము 6. పూర్ణహింగోళి రైలు (చిన్న) మార్గము 7. సికందరాబాదు కర్నూలు రైలు (చిన్న) మార్గము 8. ఖాజీపేట, బల్లారుషా రైలు (వెడల్పు) మార్గము 9. కారేపల్లి కొత్తగూడెం రైలు (వెడల్పు) మార్గము. పైనుదహరించిన రైలుమార్గములలో మొదటి రెండు కంపెనీవారివి; మిగిలిన మార్గములు మన సర్కారువారివి.

రైలుమార్గములు 3 విధములు:—

1. రెండుపట్టాలనడుమ 5½ అడుగుల వెడల్పుగలది వెడల్పు రైలుమార్గము. 2. రెండుపట్టాల నడుమ 3 అ. 3⅜ అం. వెడల్పు గలది చిన్నరైలు మార్గము. 3. రెండు పట్టాల నడుమ 2½ అడుగుల వెడల్పుగలది ఇరుకురైలు మార్గము.

## ప్రజలు.

నిజాం రాజ్యములోనున్న ప్రజలు సామాన్యముగ వ్యవసాయకులు గనుక భూములు సారవంతములై వర్షములు కురియు ప్రదేశములందు వారు నివసింపగోరుదురు. సంవత్సరములో నాలుగు పంటలు పండుభూములు మనదేశముయొక్క ఈశాన్యభాగమందున్నవి. అచ్చట దట్టమైన యడవులును కొండలును నుండుటచే వర్షమధికము. కఱవుకాలములో అడవి పంటలు అనగా సీతాఫలము, దుంపగడ్డలు మొదలైనవి యాహారముగ పనికివచ్చును. కనుక ఈప్రాంతములో ప్రజా సంఖ్య హెచ్చి చదరపు మైలొకటికి 155 గ నున్నది.

మనదేశముయొక్క నైఋత్యమునందు జనులు తక్కువగా నున్నారు. భూములు సారవంతములైనను వర్షములు తక్కువ కురిసి క్షామములు సంభవించుటయే యిందులకు కారణము. 1840 ఫసలీ జన సంఖ్యలెక్క ప్రకారము నిజాం రాజ్యములో 1, 44, 36, 148 ప్రజ లున్నారు.

జాతులు, మతములు:—నిజాం రాజ్యపు ప్రజలలో పెక్కుజాతు లున్నవి. వానిలో ముఖ్యమైనవి:—1. హిందువులు, వీరు శ్రీమహారాష్ట్రములోకంటె తెలుగుప్రాంతములో ఎక్కువయున్నారు. వీరిసంఖ్య నూటికి 66 చొప్పున నున్నది.

2. మహమ్మదీయులు:—హిందువులకు తరువాత జన సంఖ్యయందు వీరు. వీరిసంఖ్య నూటికి పది. తెలంగానకంటె మరాఠవాడిలో వీ రెక్కువగా నున్నారు గాని హైద్రాబాదు

పట్టణములో మహమ్మదీయు లత్యధికముగ నివసించుచున్నారు.
3. ఆదినివాసులు:—వీ రివ్వు డడవులలోను కొండలలోను నివసించు చున్నారు. కొందరు గ్రామములలో కూడ వసించు చున్నారు. వీరు 5 తెగలుగ విభజింపబడియున్నారు.
1. భీలు 2. గోండులు 3. కోయలు 4. లంబాడీలు 5. ఎరకలు. వీరు వరంగలు ఆదిలాబాదు, గుల్బర్గ జిల్లాలలో నెక్కువగ నున్నారు. జన సంఖ్యనుబట్టి వీరు నూటికి ముగ్గురు 4. క్రైస్తవులు:—వీరిలో దేశీయక్రైస్తవుల సంఖ్యఅధికము. అనేకులు హైదాబాదు పట్టణములో నివసించు చున్నారు. వీరు వరంగలు నల్లగొండ, మెదకు, ఔరంగాబాదులో నెక్కువగ నున్నారు.
5. జైనులు:— వీరు వణిగ్వృత్తి గలవారు వీరు ఆదిలాబాదు మెదకు, నిజామాబాదు, హైదాబాదు, చుట్టుప్రాంతము లలోను, మహారాష్ట్రమందు ప్రత్తి పయిరగు స్థలములలోను నెక్కువగా నున్నారు. నిజాం రాజ్యములోని ప్రత్తి, కాయ ధాన్యముల వర్తకము వీరిస్వాధీనములోనే యున్నది.
6. సిక్కులు:— వీరు యుద్ధవీరులు. ధైర్యవంతులు. సామాన్యముగ సేవకవృత్తియం దున్నారు. నాందేడులో వీరిగురువు గారి సమాధి యుండుటచే వారక్కడ ఎక్కువగా నున్నారు. తెలంగానకంటె మహారాష్ట్రమందు వీరిసంఖ్య అధికము.
7. పారసీకులు:— వీరు దూరదృష్టిగల వర్తకులు. ఎక్కువగ హైదాబాదు పట్టణమందును తక్కువగ ఔరంగాబాదు, వరంగలు గుల్బర్గ జిల్లాలలోను నివసించు చున్నారు.
భాషలు:— నిజాం రాజ్యములో 29 భాషలు భాషిం

చుచున్నారు. వానిలో దేశభాషలనునవి:-1 తెలుగు 2 మహా రాష్ట్రీము. 3 కన్నడము. 4 ఉర్దు, 5 భిల్లీ, 6 గోండీ, 7 కోకడి 8 కొల్హాటి 9 లంబాడి, 10 పార్ధీ, 11 వడ్డీ 12 ఎరుకలీ. ఇవి గాక యితర భాషలలో రాజస్థాని, పశ్చిమ హిందీ, అరవము, గుజరాతీ, అరబ్బీ, పారసీ, ఇంగ్లీషుకూడ గలవు.

ఉర్దు ఇచ్చటి రాజకీయభాషయై యున్నది. సర్వ సామాన్యముగ రాజధానియందున్న ప్రజలు ఉర్దు మాటాడుదురు. రాజ్యమంతటను ఇది గ్రహింపబడుచున్నది. రాజకీయభాషగాక దేశభాషలనబడు తెలుగు ఈశాన్యమునను. మహారాష్ట్రము వాయవ్యమునను కన్నడము నైరృత్యమునను వాడబడుచున్నది.

ప్రశ్నలు.

1. అంతర్దేశ, దేశాంతరవర్తకము లననేమి?
2. ఎగుమతిదిగుమతులననేమి?
3. వర్తకపు సరకులు ఏవిధముగ వచ్చుచు పోవుచునున్నవి?
4. ఏయే గొప్పవర్తక స్థానములతో మన రాజ్యములోనున్న వర్తకములకు సంబంధము గలదు?
5. రైలుమార్గమువలన లాభము లెవ్వి?
6. నిజాంరాజ్యములోని ప్రజల సంఖ్యయెంత?
7. మనరాజ్యములో ఏయే జాతులవారు నివసించుచున్నారు
8. పురాతనజాతులలో గల తెగ లెన్ని? అవి యేవి?
9. ఉర్దు, తెలుగు, మరాఠి, కన్నడము, ఇవి ఎక్కడెక్కడ భాషింపబడు చున్నవి?

# మూడవ భాగము.

## ప్రభుత్వము.

ఈరాజ్యమును మహనీయులై దైవానుగ్రహపాత్రులగు శ్రీమన్నిజాం ప్రభువుగా నేలుచున్నారు. రాచకార్యములలో సలహా లిచ్చుటకు రెండుసభ లేర్పడియున్నవి. అందొక్కటి కార్యక్రమమును నెరవేర్చుటకై యేర్పడినకార్యనిర్వాహకసంఘ మని [బాబెహుకూమతు] పేరొందియున్నది. రెండవది చట్టము లేర్పరచుపనిజూచుశాసననిర్మాణసభ యనబడుచున్నది.

కార్యనిర్వాహకసంఘము:— ఈసభలో ఒకసభాపతి, ఏడుగురు సభికులు నుందురు. సభాపతికి సద్రెఆజం అనియు, సభికులకు సదరుల్మహాము లనియు పేర్లు.

ప్రతి సదరుల్మహాము క్రింద ఒకరికంటె నెక్కువగ కార్యదర్శు [మోతమదు] లును ప్రతికార్యదర్శిక్రింద అనేకశాఖల నాజిములును పనిచేయుదురు.

పాలనక్రమము ననుసరించి నిజాం రాజ్యము నాలుగు సూబాలుగా విభజింపబడియున్నది. ప్రతిసూబయొక్క గొప్ప యధికారిని సుబేదారు అందురు. ఆయనకు లోబడి కొన్ని జిల్లా లుండును. ప్రతిజిల్లాఅధికారిని తాలుక్దా రందురు. వారలకు లోబడిన డివిజనుల పైయధికారులను సహాయ తాలుక్దారు లందురు.

ప్రతిడివిజనులోని తాలూకాలయధికారులకు తహసీల్దారు లని పేరు.

ఈఉద్యోగస్థులందరు సర్కారుఆదాయవు (మాల్) పర్యాటులపై నుందురు. వీరుగాక యితరఉద్యోగస్థులు కూడ గలరు. వారు ప్రజల హక్కులను కాపాడుదురు. ఇందులకై ప్రతిప్రాంతములో నిద్దరు సెషన్ జడ్జీలును ప్రతిజిల్లాలో ఒక నాజిం అదాలతు (జిల్లాన్యాయాధికారి) ను, ప్రతి తాలూకా కొకమునసబు నున్నారు.

దేశములో శాంతి నెలకొల్పి ప్రజలయొక్కయు వారి సొత్తులయొక్కయు భద్రత నేర్పాటుచేయు పోలీసు శాఖ యొకటి యున్నది.

ఇదిగాక ఆయురారోగ్యవిషయములు గమనించుటకును సుస్థతలకు మందు చికిత్సలు గావించుటకును ఒక వైద్య శాఖ యున్నది. ఇది పశ్వాదులక్షేమమునుగూడ నరయు చుండును.

టప్పాశాఖ:—ఒక స్థలమునుండి స్థలాంతరములకు సమాచారముల దెలుపు విలు గలిగించుచున్నది. విద్యాశాఖ ప్రజలవిద్యాజ్ఞానాభివృద్ధికై పాటుబడుచున్నది. హైద్రాబాదు పట్టణములో పురపారిశుద్ధ్య (సఫాయి) శాఖయు జిల్లాలలో లోకల్ ఫండు సభలును ప్రజలసౌకర్యములకొరకు ప్రయత్నించు చున్నవి. తామీరాతుశాఖ రాజ్యములోని బాటలు, వంతె నలు, కచ్చేరీలు, మొదలైన నిర్మాణములు చేయుచున్నది. ఆ బ్పాషిశాఖ (నీటిపారుదల) ఇది చెరువులు కాలువలు మొద లైనవి త్రవ్వించి రైతులకు సహాయపడుచున్నది. దేశములో అల్లకల్లోలములు జరుగకుండ కాపాడుటకు సేనాశాఖయుగలదు.

ప్రకృతమందు దేశమందెల్లెడల శాంతిసౌఖ్యములునిండి యున్నవి. అందరికిని మతవిషయములందు స్వేచ్ఛ గలదు. మన కిట్టి యనుకూలత లొసంగినందులకు మహనీయులును ప్రభాసంపన్నులగు మన హుజూరుగారియెడ మనము కృతజ్ఞత గలిగియుండవలెను.

## రాజ్య విభాగము




మన రాజ్యము రెండు భాగములుగ విభజింపబడియున్నది. ఒక భాగము నేరుగ రాజు గారిప్రభుత్వాధికారములో నున్నది. అది ఖాల్సా లేక దీవాని యనబడును. దీనిరాబడి (మాల్గుజారి) సర్కారుఖజానాలో చేర్చబడును. దేశ పరిపాలనమును బట్టి నిజాం రాజ్యము తెలంగాన, మహారాష్ట్రమను రెండుప్రాంతములుగ విభజింపబడియున్నది. ప్రతి ప్రాంతములో రెండు సూబాలును ప్రతిసూబాలో కొన్నిజిల్లాలును గలవు.

తెలుగు ప్రాంతములో వరంగలు, మెదకు (గుల్షనాబాదు) అను రెండు సూబాలున్నవి. వరంగల్ సూబాలో వరంగలు, కరీంనగరు, ఆదిలాబాదుజిల్లాలున్నవి. మెదకుసూబాలో మెదకు మహబూబ్ నగరు, నల్లగొండ, నిజామాబాదు జిల్లాలున్నవి.

మహారాష్ట్ర ప్రాంతములో ఔరంగాబాదు, గుల్బర్గలను సూబా లున్నవి. ఔరంగాబాదు సూబాలో ఔరంగాబాదు, పర్భని, నాందేడు, బీడుజిల్లాలు గలవు. గుల్బర్గ సూబాలో గుల్బర్గ, ఉస్మానాబాదు, బీదరు, రాయచూరు జిల్లా లున్నవి.

రెండవభాగము రాజుగారిసర్కారుశాఖాధీనము కాదు. దానిరాబడికూడ సర్కారుఖజానాలో చేర్చబడదు. ఈ భాగమునకు గైరుఖాల్సా యనిపేరు. ఇది మరల రెండు భాగములుగ విభజింపబడియున్నది. దీనిలో ఒకభాగమునకు సర్ఫెఖాసనిపేరు. ఇది నిజాం ప్రభువుగారి సొంతయాస్తి. ఇది రాజ్యమునం దచ్చటచ్చట నున్నది. హైదరాబాదునగరమును పరివేష్టించియున్న సర్ఫెఖాసుభాగము లన్నియు నొక్కటిగా చేర్చి యీమండలమునకు రాజధానిపరివేషమండలము (అత్రాఫుబల్దాజిల్లా) అని పేరిడబడినది. దీనిని సర్ఫెఖాసుకార్యదర్శియధికారము క్రింద ఒక తాలూక్దారు నియమింపబడి ఏలుచుండును. సర్ఫెఖాసులోని మిగతభాగము వేరువేరు జిల్లాలలో నున్నది. జిల్లాలలోని సర్ఫెఖాసు తాలుకాలు కొన్ని దీవాని శాఖవారికి నొప్పగింప బడి యున్నవి. వీనికి దీవానీనశీక్రృతము లనిపేరు. మరికొన్ని సర్ఫెఖాసు అధికారములోనే యుండి దీవానీ పరివీక్షణలో నున్నవి. వీనికి దీవానీ పరివీక్షణ తాలూకా లని పేరు.

గైరుఖాల్సాయొక్క రెండవ భాగము జాగీరులు. వీనిలో పాయగాలు, సంస్థానములు గలవు. రాజ్యములో రెండు పాళ్లు ఖాల్సగను ఒకపాలు సర్ఫెఖాసుగా నున్నది. నిజాం రాజ్యములోని కొన్నిజిల్లాలలో ఇంగ్లీషువారిరాజ్యభాగములు కొన్ని యున్నవి. వాని నాంగ్లేయప్రాంతము లందురు.

| సుభా | జిల్లా | డివిజన్ | తాలూకాలు |
|---|---|---|---|
| వరంగల్లు | అత్రాఫ్ బల్దా జిల్లా (హైదరాబాదు) | తూర్పు | తూర్పు తాలుకా - (అంబరు పేట)<br>పడమర తాలుకా - (అసిఫ్ నగరు) |
| | | పడమర | ధారూరు-ఖడ్కు-హుమ్నాబాదు |
| | | దక్షిణము | ఉత్తర తాలుకా (మేడచలు)<br>దక్షిణ తాలుకా (షాబాదు) |
| | వరంగల్లు | వరంగలు | వరంగలు, పాఖాల, ములుగు |
| | | మహబూబాబాదు | మహబూబాబాదు ఇల్లందు, పాలవంచ |
| | | ఖమ్మము | ఖమ్మము, మధర. |
| | కరీంనగరు | కరీంనగరు | కరీంనగరు |
| | | జగత్యాల | జగత్యాల, సిరిసిల్ల, సుల్తానాబాదు |
| | | హుజూరాబాదు | హుజూరాబాదు, పర్కాల, మహాదేవపూరము. |
| | ఆదిలాబాదు | ఆదిలాబాదు | ఆదిలాబాదు, కిన్వటు, బోథ్, నిర్మలు. |
| | | చెన్నూరు | చెన్నూరు, లక్షెట్టిపేట |
| | | అసిఫాబాదు | అసిఫాబాదు, సిర్పూరు, రాజూర, ఊటనూరు. |

| సూబా | జిల్లా | డివిజన్. | తాలూకాలు |
|---|---|---|---|
| మెదకు (గుల్షనాబాదు) | మెదకు | మెదకు | మెదకు, సిద్దిపేట, అందోలు |
| | | బాగాతు | బాగాతు, కలబ్గూరు |
| | నిజామాబాదు | నిజామాబాదు | నిజమాబాదు, బోధను |
| | | కామారెడ్డి | కామారెడ్డి, ఎల్లారెడ్డి, ఆర్మూరు |
| | నల్లగొండ | నల్లగొండ | నల్లగొండ |
| | | భువనగిరి | భువనగిరి, జనగామము, సూర్యాపేట |
| | | మిరియాలగూడ | మిరియాలగూడ, దేవరకొండ, హుజూరునగరు |
| | మహబూబ్ నగరు | జడచర్ల | మహబూబ్ నగరు, మక్తలు, పర్గి |
| | | నాగరకర్నూలు | నాగరకర్నూలు, కలవకుర్తి, అమరాబాదు |

# మహారాష్ట్ర ప్రాంతము.

| సుబా | జిల్లా | డివిజన్ | తాలూకాలు |
|---|---|---|---|
| ఔరంగాబాదు | ఔరంగాబాదు | ఔరంగాబాదు | ఔరంగాబాదు, కన్నడ్, ఖుల్దాబాదు, వీజాపూరు, గంగాపూరు (సర్ఫెఖాను) |
| | | జాల్నా | జాల్నా, భోకర్దన్, అంబడ్, పటన్, సిల్వాడ్ (సర్ఫెఖాను) |
| | పర్భని | పర్భని | పర్భని, పాథ్రీ, జేతూరు, పాలం (సర్ఫెఖాను) |
| | | హింగోలి | హింగోలి, బిస్మతు, కలమ్నూరి. |
| | నాందేడు | నాందేడు | నాందేడు, హద్గాం |
| | | దిగ్లూరు | దిగ్లూరు, కంధహారు, బిలోలి, ముధ్హోల్ |
| | బీడు | బీడు | పాటోడ, అష్టి, బీడు |
| | | మోమినాబాదు | మోమినాబాదు, మంజలేగాం, గేవరాయు. |

| సూబా | జిల్లా | డివిజన్. | తాలుకాలు |
| --- | --- | --- | --- |
| గుల్బర్గ | గుల్బర్గ | సేడం | సేడం, గుల్బర్గ, కొడంగల్, చించోళి. |
| | | షోరాపూరు | షోరాపూరు, షాపూరు, యాద్గిరు, అందోల. |
| | ఉస్మానాబాదు | ఉస్మానాబాదు | ఉస్మానాబాదు [సర్ఫెఖాసు] |
| | | | తుల్జాపూరు, లాతూరు, కల్లం (సర్ఫెఖాసు), ప్రేసడ (సర్ఫెఖాసు) |
| | బీదరు | ఉద్గీరు | ఉద్గీరు, బీదరు, అహమదుపూరు, నల్లంగ, జవ్వాడ (సర్ఫెఖాసు). |
| | రాయచూరు | రాయచూరు | రాయచూరు, ఆలంపూరు, మాన్వి, దేవదుర్గ్. |
| | | లింగసుగూరు | లింగసుగూరు, సింధనూరు, గంగావతి, కుష్టిగి, |

## ప్రశ్నలు.

1. కార్యనిర్వాహకసభ యనగనేమి?
2. చట్టము లేర్పరచు సభకు గల పేరేమి?
3. కార్యనిర్వాహక సభయొక్క అధ్యక్షులకును యితరసభికు లకు నియ్యబడిన పేళ్ళెవ్వి?
4. దేశములో న్యాయశాఖ ఏరీతి నేర్పడియున్నది?
5. ఖాల్సా, గైరుఖాల్సా లన నేమి?
6. సర్ఫేఖా సన నేమి?
7. నిజాంరాజ్యము ఏయే సూబాలుగ విభజింపబడినది? అందొక దానిజిల్లాలను పేర్కొనుడు.

# హైదారాబాదు పట్టణము.

హైదారాబాదు ఒక పురాతన పట్టణము. దీని పునాది, కుతుబ్ షా వంశములో 5 వ రాజగు మహమ్మదుకులికుతుబ్ షా 1591 క్రీ. శ. లో వేసెను. నిజాంరాజ్యమునకు రాజధాని యగు నీపట్టణము మూసానదీతీరమునం దున్నది. రాజ్యములోని గొప్పకచేరీలు, విద్యాలయములు మొదలైన విక్కడనే యుండు టచే దీనిజనసంఖ్య అత్యధికముగ నున్నది. ఇచ్చట నాలుగు లక్షలకుపై బడి జనులు నివసించుచున్నారు. జనసంఖ్యనుబట్టి ఈపట్టణము హిందూదేశములో నాల్గవదై యున్నది. ఈ పట్ట ణము నదికి నిరుప్రక్కల వ్యాపించియుండుటచే నదిపైన నాలుగు వంతెనలు కట్టబడియున్నవి. 1. పాతవంతెన 2. ముసల్లంవంతెన

3 క్రొత్తవంతెన 4 చాదర్ఘాటువంతెన. క్రొత్తవంతెనమీదుగ పోవుదారి పట్టణమునకుమధ్యగా పోవుచున్నది. దీనిపై ప్రతి దినము వేనవేలు జనులు, వందలకొలది జట్కాలు, బగ్గీలు, మోటార్లు, సైకిళ్ళు, రేయింబగళ్లు నడుచుచున్నవి. పట్టణములో పత్థర్‌గట్టి యనునొక పెద్దబజారు గలదు. అచ్చటబాటకు నిరువైపుల స్వదేశి, విదేశి వస్తువుల దుకాణము లున్నవి. ప్రస్తుతము పట్టణముయొక్క శోభను వృద్ధిపరచుటకై బాటల వైశాల్యమును హెచ్చించి యిరుప్రక్కల మంచి భవనములును దుకాణములును కట్టుచున్నారు. మరియు తగు ప్రదేశములలో మనోహరములైన ఉద్యానవనములను నిర్మించుటచే పట్టణము యొక్క శోభాసౌందర్యములు హెచ్చుచున్నవి.

ప్రజల విహారము కొరకు మూసానదీతీరమున క్రొత్తవంతెనయొద్ద నొక ఆరామము తయారు చేయబడినది. అందు ప్రజలు ఉదయమునను సాయంసమయమునను విహారముకొరకు వత్తురు. ఇంతియేగాక పట్టణములో పౌరప్రముదావనము (బాగెఆమ్మ) ఒకటి గలదు. అందు నిరుప్రక్కల నానా జాతుల పూలచెట్లుగల అందమైన చిన్నాలును, మనోహరమైన కోనేరులును, అచ్చటచ్చట కూర్చుండుటకు ఇనుపకుర్చీలు నున్నవి. వారమున కొక పర్యాయము సాయంసమయమున బ్యాండువాద్య మగును. ఈతోటలో జంతువుల యొక్కయు స్వదేశీ కార్మికముల యొక్కయు ప్రదర్శనశాల లున్నవి. జంతుప్రదర్శనశాలలో జంతుసృష్టి పులిసింహములును, నానా జాతులపక్షులు నున్నవి.

మరియు ప్రతిసంవత్సరము రజ్జబు అను హిజ్రీనెల యంతయు నిచ్చట గొప్ప వస్తుప్రదర్శనోత్సవము (నుమాయష్) జరుగును. వేనవేలు ప్రజలు చూచుటకు వత్తురు. ఈవిహారస్థలమందు ఒకదర్బారు మందిరమును ప్రజలసభలకొరకు పౌరమహామందిర మొకటియు (టవునుహాలు) కట్టబడియున్నవి. కొంతకాలము క్రిందట ప్రభువుగా రిచ్చట నొక నిరుపమానమైన మస్జిదు కట్టించిరి.

విద్యార్థులకొరకు హైదరాబాదుపట్టణములో ఉస్మానియ కాలేజు, నిజాంకాలేజు, సిటీకాలేజు, మెడికల్ కాలేజు, యింజనీరింగుకాలేజు, ట్రైనింగుకాలేజు, అను గొప్పవిద్యాలయములు గలవు. వీనిలో నిజాంకాలేజు మద్రాసు విద్యాపీఠముతోను మిగిలినవి ఉస్మానియవిద్యాపీఠముతోను సంబంధించియున్నవి.

మనహిందూదేశములో సర్వజన సామాన్యమగు ఉర్దు భాషలో ఉత్తమవిద్యల నేర్పు ప్రతిష్ఠాపనలలో ఇప్పటికి మొకటిది యీఉస్మానియా విద్యాపీఠమే.

ఇది 20 మెహరు 1328 / 28 ఆగష్టు 1919 న హైదరాబాదులోస్థాపింపబడినది.

దక్కను కిరీటాధిపతియగు ఆలాహజరతునవాబ్ మీర్ ఉస్మాన్ అలీఖాన్ బహదుర్ విద్యాపోషణకై చేసిన ప్రతిభావంతమైన కార్యమైయున్నది. ఈ ఉస్మానియవిద్యాపీఠమువలన ఉత్తమ విద్యల నేర్చుకొనువారిసంఖ్య దినదినము ప్రబలుచున్నది. ఇట్టి విద్యావిధాన మను తోటయొక్క మహిమ క్రమక్రమముగావిస్త

రించి ఒకదక్కనే కాక హిందూస్థానము నంతయు సారవంత
ముగ చేసి విద్యాసస్యఫలదాయకముగ జేయు కాలము ఎంతో
దూరమున లేదు.

ఈసర్వకళాశాలతోబాటు భాషాంతరీకరణ సంస్థ
యొకటి (దారుత్తర్జుమ) ఏర్పడియున్నది. ఇందు గొప్ప గొప్ప
యింగ్లీషు, అరబి, పారసీ, పుస్తకములు మహాపండితులచే
ఉర్దూలోనికి పరివర్తింపబడుచున్నవి. దీనివలన ఉర్దూభాష
బహుత్వరలో ఇతరగొప్పభాషలతో తుల్యముకాగలదు.

ప్రజలు చదువుకొనుటకు సర్కారువారి గొప్ప ఆసఫియా
పుస్తక భాండాగార మొకటి గలదు. అందులో వివిధకళలకును
శాస్త్రములకును సంబంధించిన నూత్నపురాతన గ్రంథములు
వేనవేలు గలవు. అందరును ఉచితముగ చదువవచ్చును.

ప్రజాచికిత్సలకై మూసానదీతీరమున క్రొత్తవంతెన
యొద్ద ఉస్మానియ వైద్యశాల యొకటి కట్టబడి యున్నది.
ఈవైద్యమందిరము హిందూదేశములో శ్రేష్ఠతమమైనట్లు ఎన్న
బడుచున్నది. వేయికంటె ఎక్కువ రోగులిం దుండగలరు.
వారల కందరకు మందును,ఆహారము నుచితముగ నివ్వబడును.
స్త్రీలకొరకు ప్రత్యేక వైద్యశాల యొకటి గలదు. అవిటి, అనా
థుల కొరకు వేర్వేరుగ శరణాలయములుకూడ కట్టబడియున్నవి.

ఇచ్చటి దర్శనీయములైన కట్టడములలో చార్ మినారు
మక్కామస్జిదు, జామెమస్జిదు, హైకోర్టు,సిటికాలేజు,ఉస్మానియ
వైద్యశాల, ఫలక్‌నుమ, చౌమహల్ల, నిజామియనక్షత్రావలో
కనశాల, నోబుల్సు కాలేజి, అయియున్నవి. ఇచ్చటగొప్పకర్మా

గారములుకూడ ఉన్నవి. ఈకర్మాగారములలో టంకశాల ముఖ్యమైనది. అచ్చట నాణెములు ముద్రింపబడును. మరియు ననేకయంత్రములకు కావలసిన పోతపనులు జరుగును. ఇందు విద్యుచ్ఛక్తి గలిగించి తన్మూలమున పురమందలి దీపములును, గాలియంత్రములును మొదలగునవి పనిచేయును.

ప్రశ్నలు.

1 హైదరాబాదు పట్టణమును ఎవరు, ఎప్పుడు స్థాపించిరి? 2 ఇచ్చటి ముఖ్యమైనవంతెనలు ఏవి? 3 పట్టణమందు విహార స్థలము లేవేవి గలవు? 4 అన్నిటికంటె పెద్ద విహారస్థలమును గురించి క్లుప్తముగా జెప్పుము. 5 హైదరాబాదులోనుండు ముఖ్య పాఠశాల లేవి? 6 హైదరాబాదునందు దర్శనీయము లగు కట్టడములనుగురించి వర్ణింపుము.



తెలుగుప్రాంతము.

# నగరపరివేష్టన జిల్లా.

(అత్రాఫ్‌బల్దజిల్లా) ఈజిల్లా సర్కారుఖాసు యిలాకాలో నున్నది. దీనికి నుత్తరమున బీదరు, మెదకు జిల్లాలును; తూర్పున నల్లగొండజిల్లా; దక్షిణమున మహబూబ్ నగరుజిల్లా; పడమట గుల్బర్గజిల్లాలు నున్నవి.

ఈజిల్లాలో మూడు డివిజన్లు గలవు. తూర్పుడివిజన్ పశ్చిమడివిజన్, దక్షిణడివిజన్. తూర్పుడివిజన్‌లో తూర్పు

తాలూకా అంబరపేట, పశ్చిమతాలూకా అసిఫ్‌నగరు నై యున్నది. పశ్చిమడివిజన్‌లో షాహాబాదు, ఖర్గ, హుమ్నాబాదు తాలూకాలును, దక్షిణడివిజన్‌లో ఉత్తరపుతాలూకా మేడిచల్, దక్షిణపు తాలూకా (షాబాదు).

జిల్లాలోని ఎక్కువభాగము కొండప్రదేశము. రాచకొండ యను పర్వతపంక్తి అంబరుపేటతాలూకాకు దక్షిణముగా పోవుచున్నది. అనంతగిరియను పర్వతపంక్తి మహబూబ్ నగరుజిల్లాగుండ షాహాబాదువరకు వ్యాపించియున్నది. ఈజిల్లాలో మూసానది అనంతగిరియొద్ద పుట్టి హైదరాబాదు, నల్లగొండలగుండ ప్రవహించి కృష్ణానదిలో కలియుచున్నది. ఈజిల్లాకు నుత్తరమున మంజీరానది ప్రవహించుచున్నది. ఉస్మాన్‌సాగర్, హిమాయత్‌సాగర్, హుసేన్ సాగర్, మీర్ ఆలం లను పెద్దచెరువు లిచ్చట గలవు. ఇచ్చట గాలి తడిగా నుండుటచే తరుచుగా వర్షఋతువులో మలేరియా జ్వరము ప్రబలును. వరి, గోధుమ, జొన్న, మొక్కజొన్న, ప్రత్తి, కాయధాన్యములు నూనెదినుసులు ఇచ్చట పైరగును.

ప్రసిద్ధస్థలములు:—

హైదరాబాదు:—ఇది రాజధాని. మూసానదీతీరమందున్నది. గొప్ప వర్తకస్థలము. మనము మీ పట్టణమును గురించి యిదివరకే చాలవరకు చదివియున్నాము.

సికిందరాబాదు:—ఇది హిందూ దేశములోని పెద్ద యింగ్లీషుసైన్య స్థానము, గొప్ప వర్తకస్థలము. రాజ్యము

నందలి అరోహామార్గములకు మూలస్థానము.

బొలారము:—ఇది సికిందాబాదు సైన్యస్థానము యొక్క ఒకభాగము. రెసిడెంటుగారి నివాసస్థానము.

మవులాఆలీ:—ఇచ్చట రజ్జబు అను హిజీ నెలలో ప్రతి సంవత్సరము గొప్పఉర్సు జరుగును. దీనికి లింగంపల్లి ఉత్సవమని పేరు.

గోల్కొండ:—హైద్రాబాదునకు పశ్చిమమున 5 మైళ్ల దూరములో నున్నది. ఇచ్చట వరంగలురాజుచే కట్టబడి కుతుబ్ షాహీ ప్రభువులచే బలపరుపబడిన పురాతనకోట యొకటి గలదు. ఇది కొండపైన మూడుమైళ్ల నాక్రమించుకొని యున్నది. ఇచ్చట చూడదగిన కట్టడములలో బాలాహిసారు, జామెమస్జిదు. మోతిమహాలు కోటకు నుత్తరమున కుతుబ్ షాహిసుల్తానుల సమాధి మంటపములు నున్నవి.

హుమ్నాబాదు:— ఇది యొక జనసమృద్ధమైన వర్తకస్థానము.

ప్రశ్నలు.

1 అత్రాపుబల్దజిల్లాకు బీదరు, మెదకు, నల్లగొండ మహబూబ్ నగరు, గుల్బర్గ లేయేదిక్కులం దున్నవి? 2 ఈ జిల్లాలో ప్రవహించు పెద్దనది ఏది? 3 గోల్కొండ ఎక్కడ నున్నది, దేనికి ప్రసిద్ధి? 4 సికిందాబాదు ఎందులకు ప్రసిద్ధి జెందినది?

# వరంగలు జిల్లా

ఈజిల్లా నిజాంరాజ్యములో తూర్పున నున్నది. దీనికుత్తరమున కరీంనగరు జిల్లా; తూర్పున గోదావరీనది; దక్షిణమున ఇంగ్లీషువారి కృష్ణాజిల్లాయును కృష్ణానదియును; పశ్చిమమున నల్లగొండజిల్లాయు గలవు ఈజిల్లాలో మూడుడివిజను లున్నవి. వరంగలు, మహబూబాబాదు, ఖమ్మము. వరంగలు, పాఖాలు, ములుగు తాలుకాలు వరంగలుడివిజనులోను; మహబూబాబాదు, యల్లందు, పాలవంచ తాలుకాలు మహబూబాబాదు డివిజనులోను; ఖమ్మము, మధిర తాలుకాలు ఖమ్మము డివిజనులోను నున్నవి.

ఈజిల్లాలో చిన్నచిన్న గుట్టలు కనబడుచున్నవి. కందికలుగుట్టలు ఆగ్నేయమున ప్రారంభించి ఆదిలాబాదువరకు వ్యాపించి యున్నవి. చంద్రగిరిగుట్టలు జిల్లాకు వాయవ్యమున నున్నవి. ఈశాన్యమున గోదావరీనదిచే ఈజిల్లా సాగుబడియగుచున్నది. ఇవిగాక మున్నేరువైరానదులుకూడ ప్రవహించుచున్నవి. ఈజిల్లాలోని చెరువులలో ముఖ్యమైనవి పాఖాల, రామప్ప, నాగారం, లక్నారము, సంగరుభూపాలం, పాలేరు, వైరా చెరువులు. ఇందు శీతోష్ణస్థితి ఆరోగ్యప్రదమైనది గాని పాఖాల, ములుగు, పాలవంచ, ప్రాంతములలోని గాలి తడిగా నున్నది. మంచివర్షములు కురియును. వరి, చోళ్లు, జొన్నలు, మొక్కజొన్నలు, పప్పుదినుసులు, నీలి, ప్రత్తి, పొగాకు, నూనెగింజలు ఇక్కడి ముఖ్యములైన పంటలు. ఈజిల్లాలో ప్రతిచోటను

కంబళ్లు నేయుదురు.

ప్రఖ్యాతస్థలములు:—

వరంగలు:—గొప్పవర్తక స్థలము. ఇచ్చట జైలులో శ్రేష్ఠములైన జంఖానాలు, ఖద్దరు, తయారగును. టస్సరుబట్టలు, కాగితముకూడ సిద్ధమగును. కాకతీయరాజుల రాజధానియగు ఓరుగల్లులోని కోట, ద్వారస్తంభములు, బురుజులు చూడదగినవి.

హనుమకొండ:— ఇది సూబాకులు జిల్లాకును ముఖ్యపట్టణము. ఇచ్చట వేయిస్తంభములుగల పురాతనదేవాలయమొకటికలదు. మరియు అబ్దున్నబిషామహాత్ముని సమాధిమండపమున్నది. ప్రతిసంవత్సరము ఉర్సు జరుగును. ఇచ్చట మంచి రుమాళ్లు దొరకును.

మట్టెవాడ:— ఇచ్చట శ్రేష్ఠములైన తివాసీలు, టస్సరు బట్టలు తయారగును, పెద్దవర్తక స్థలము.

కాజీపేట:— ఇదిరైలుమార్గపు జంక్షను. ఇక్కడనుండి బెజవాడకును బలార్షాకును రైలుమార్గము పోవుచున్నది. ఇచ్చట షాఅబ్జల్ బయాబాని మహాత్ముని సమాధిమండపమున్నది. ప్రతిసంవత్సరము ఉర్సు జరుగును.

ఖమ్మము:— ఇచ్చట మేలైన ఎడ్లు దొరకును.

+ యల్లందు:— బొగ్గుగనులకు ప్రసిద్ధి; కారేపల్లినుండి కొత్తగూడెంవరకు రైలు వేయబడినది.

సింగరేణి:— ఇచ్చట గనిబొగ్గు బయలుదేరుచున్నది. వంటచెరుకునకును గనిబొగ్గునకును ఎగుమతిస్థలము.

హానువర్తి:— ఇచ్చట టస్సరుబట్టలు నేయబడును.
పాఖాలమహబూబాబాదులలో పెద్దయడవు లున్నవి. ఇవి సర్కారువారి వేటస్థలములు.

మధిర:— ఇది పెద్దవర్తకస్థానము. ఇచ్చటి ఎడ్లు ప్రశస్తములైనవి.

పైగాసర్కారి యిలాక:—

పాలవంచ:—ఇదియొక సంస్థానము. ఇది అనారోగ్యస్థలమగుటచే ప్రజాసంఖ్య తక్కువ. దీనిముఖ్యస్థానము అశ్వారావుపేట.

ప్రశ్నలు.

1. ఈజిల్లాలో ప్రవహించునదు లేవి? 2. శీతోష్ణస్థితు లెట్లున్నవి? 3. ఈజిల్లాయొక్క పంట లేవి? 4. మట్టెవాడ, వరంగలు, హానుమకొండ, హానువర్తి, మధిరలలో ఏయే వస్తువులు శ్రేష్ఠములు? 5. వంట చెరుకును, గనిబొగ్గును, ఎచ్చట లభించుచున్నవి? 6. జిల్లాలో పైగా సర్కారి యిలాకా ఏది?

# కరీంనగరుజిల్లా.

ఈజిల్లాకు ఉత్తరమున గోదావరీనది; తూర్పున గోదావరీనది వరంగలుజిల్లా; దక్షిణమున వరంగలు నల్లగొండ జిల్లాలు; పడమట నిజామాబాదు మెదకుజిల్లా లున్నవి.

ఈ జిల్లాలో మూడు డివిజను లున్నవి. కరీంనగరు, జగత్యాల, హుజూరాబాదు. కరీంనగరుడివిజను డిప్యూటీకలెక్టరు గారి అధికారములో నున్నది. జగత్యాల డివిజను లోయుండు జగ

త్యాల సిరిసిల్ల, సుల్తానాబాదు తాలూకాలును, హుజూరా బాదు డివిజన్ లో హుజూరాబాదు, పరకాల, మహాదేవ పురము తాలుకా లున్నవి.

ఈజిల్లాలో కొన్ని పెద్దగుట్ట లున్నవి. తూర్పున కందికలు గుట్టలు ఉత్తరమునుండి దక్షిణమువరకు వ్యాపించియున్నవి. ఉత్తరమున రాఖీగుట్ట లున్నవి. ఈగుట్టలప్రదేశములలో టేకు, జిట్రేగు, మద్ది మొదలగు చెట్లు పెరుగుచున్నవి. జిల్లాయొక్క ఈశాన్యహద్దులో గోదావరీనది ప్రవహించుచున్నది. మానే రు జిల్లామధ్యనుండి పారుచు మహాదేవపురము నొద్ద అందులో కలియుచున్నది. చెరువు లనేకములు గలవు. సామాన్యముగ ఆరోగ్య ప్రదేశము. వరి, జొన్నలు, ప్రత్తి, పప్పుదినుసులు, నూనెగింజలు ఇక్కడి ముఖ్యసస్యములు.

ప్రఖ్యాత స్థలములు:—

కరీంనగరు:— ఇది జిల్లాకు ముఖ్యస్థానము. ఇచ్చట వెండితీగతో అందమైన వస్తువులు చేయబడును. నూలు వస్త్ర ములుకూడ తయారగుచున్నవి.

జగత్యాల:— ఇచ్చట ఫ్రెంచు యింజనీర్లచే 1747 క్రీ॥ శ॥ లో కట్టబడిన కోట గలదు.

మహాదేవపురము:— ఇచ్చట మంచి టస్సరు బట్టలు నేయబడును.

మంథని:— గోదావరీతీరమున బ్రాహ్మణుల పెద్దగ్రా మము.

కోరట్ల:—ఇచ్చట కాగితములు తయారగును.

మలంగూరు:—ఈగ్రామము హుజూరాబాదు తాలు కాలో నున్నది. ఇచ్చట సుమారు వేయియేండ్ల క్రిందట కట్టిన కోట యున్నది.

బిజ్జీర్:—ఇచ్చటఅంకూస్‌షామహోత్సవిపుర్సుజరుగును.

మానకొండూరు:—ఇది కరీంనగరునకు సమీపమున నున్నది. ఇచ్చట వెండితీగెలో విచిత్రవస్తువులు చేయబడును.

యల్లదలు:—ఇచ్చట పురాతనకోట యొకటి గలదు. పూర్వ మిది జిల్లాకు ముఖ్యస్థానము. ఇత్తడిసామగ్రులుకూడ ఇచ్చట చేయబడును.

పరకాల:—ఇది ఇత్తడి సామగ్రులకు ప్రసిద్ధి. ఈ జిల్లాకు మధ్యనుండి ఖాజిపేట బల్లారుషారైలుమార్గము పోవు చున్నది.

రైరుసర్కారియిలాక:—

వేములవాడ:—ఇది జాగీరుగ్రామము. సిరిసిల్లాకు నుత్తరమున 8 మైళ్ళలో నున్నది. ఇచ్చట రాజేశ్వరాలయ మొకటి గలదు. తెలుగుప్రాంతమందున్న హిందువులకు గొప్పయాత్రాస్థానము. లోకప్రసిద్ధిచెందిన వేములవాడభీమకవి యీగ్రామవాసియే. ఇట గల భీమేశ్వరాలయము ప్రసిద్ధమైనది.

ధర్మపురి:—ఇది బ్రాహ్మణుల జాగీరు. ఇచ్చట నర సింహాలయము న్నది. తీర్థమగును.

పెద్దపల్లి:—జాగీరు గ్రామము; వర్తక స్థలము.

ప్రశ్నలు.

1. ఈజిల్లాలో ఏయేకొండలున్నవి? 2. ఈజిల్లాలో ప్రవ

హించు నదులేవి? 3. కరీంనగరు, కోంట్ల, మహాదేవపురము ఇచ్చట దొరుకు ముఖ్యమైన వస్తువులేవి? 4. జగత్యాల, మలంగూరు, యివి యెందుకుప్రసిద్ధి? 5. ఈజిల్లాలో నున్న హిందువుల యాత్రాస్థలము లెవ్వి?

# ఆదిల్లాబాదు జిల్లా.

ఈజిల్లా తెలంగానాకు నుత్తరపుహద్దులోనున్నది. దీనికి నుత్తరమున పాయిన్‌గంగ వరధానదులు; తూర్పున ప్రాణహితానది, దక్షిణమున కరీంనగరు, నిజామాబాదు జిల్లాలు; పడమట పాయిన్ గంగానదియు నాందేడుజిల్లాయు నున్నవి.

ఈజిల్లాలో మూడు డివిజను లున్నవి. ఆదిలాబాదు, చెన్నూరు,ఆసిఫాబాదు;ఆదిలాబాదుడివిజన్ లో ఆదిలాబాదు, కిన్వటు, బోధ, నిర్మలు తాలూకాలు; చెన్నూరుడివిజన్ లో చెన్నూరు, లక్సెట్టిపేట తాలూకాలు;ఆసిఫాబాదు.డివిజన్ లో ఆసిఫాబాదు,సిర్పూరు,రాజూర, ఉట్నూరు తాలూకాలున్నవి.

సహ్యాపర్వతములు నిర్మలులోను ఇంకను పశ్చిమము నను వ్యాపించియున్నవి.ఇవిగాక యనేకములైన గుట్టలుగలవు. పాయిన్‌గంగ వరధానదులు జిల్లాలకు నుత్తరహద్దులో నున్నవి. తూర్పులో ప్రాణహితానది ప్రవహించు చున్నది. మరికొన్ని చిన్ననదులుకూడ జిల్లాలో పారుచున్నవి. ఇది అనారోగ్య ప్రదేశము. ఈజిల్లాలో చాలదూరమువరకు ఘోరారణ్యము లున్నవి. వర్షమధికముగా కురియును. అరణ్యప్రదేశమగుటచే

జనులు తక్కువ. ఇచ్చట వరి, గోధుమలు, జొన్నలు మొక్క జొన్నలు, పొగాకు, పప్పుదినుసులు మొదలైనవి పైరగుచున్నవి.

ఖ్యాతిగల స్థలములు:—

ఆసిఫాబాదు:— జిల్లాకు ముఖ్యస్థానము.

ఆదిలాబాదు:—ఇది తాలూకాయొక్క ముఖ్యస్థానము. పెద్దవర్తకస్థలము.

నిర్మలు:— ఇచ్చట లక్కపూసిన కర్రవస్తువులు తయారగును. మరియు నిందొక కోట కలదు.

చెన్నూరు:— టస్సరు బట్టలకు ప్రసిద్ధి. ఈతాలూకాలో బొగ్గుగని కనిపెట్టబడెను.

రాజూర:—ఇచ్చట నొక యినుపగని కనిపెట్టబడెను. పురాతనకోటకూడ గలదు.

సిర్పూరు:—ఛాగళ్ల (నీటిబుడ్లు)కొరకు ప్రసిద్ధి. సాస్టి, పావను [రాజూరతాలూకా]లలో బొగ్గుగను లున్నవి.

మాహూరు:— ఇచ్చటి గేదెలు ఎక్కువ పాలిచ్చును. కొండపైన ఆనక దేవుని పురాతనాలయ మున్నది. అచ్చట వేడి నీళ్లగుండ మొకటి కలదు.

అర్జుండు కాటను, భోర:—ఈప్రదేశములలో గూడ వేడినీటియూట లున్నవి. కాజిపేట- బలారుషా రైలుమార్గము ఈజిల్లాగుండ పోవుచున్నది.

హైదరుసర్కారియిలాక:—

యల్లడవు:—ఇదిపాయగా యొక్క తాలూకా. ఇచ్చట మంచివడ్లు పైరగును. ఇనుపగనులుకూడ కనుగొనబడినవి.

## ప్రశ్నలు.

1. ఈజిల్లాలో నున్న పర్వతములను, నదులను చెప్పుము. 2. వర్షము, శీతోష్ణస్థితు లెట్లున్నవి ? 3. ఈజిల్లాలో ప్రజలు తక్కువ యగుటకు కారణ మేమి ? 4. సిర్పూరు, నిర్మలు, చెన్నూరులలో దొరకుమంచి వస్తువు లేవి ? 5. గనిబొగ్గు ఎక్కడెక్కడ కనిపించుచున్నది ? 6. వేడినీళ్ల బావు లెక్కడ నున్నవి !

---

# మెదకు జిల్లా.

ఈజిల్లాకు నుత్తరమున నిజామాబాదు, కరీంనగరు జిల్లాలు; తూర్పున కరీంనగరు, నల్లగొండజిల్లాలు; దక్షిణమున ఆత్రాపుబల్ల జిల్లా; పడమట బీదరుజిల్లా యున్నవి. ఈజిల్లాలో మేదకు, భాగాతు అను రెండుడివిజను లున్నవి. మేదకు డివిజనులో మేదకు, సిద్దిపేట అంవోలుతాలుకాలు; భాగాతు డివిజనులో భాగాతు, కలబ్గూరు తాలూకా లున్నవి.

ఈజిల్లాలో పెద్దపర్వతములు లేవు. అయిననుచిన్న చిన్న గుట్టలున్నవి. ఒకపంక్తి యుత్తరమున రామాయంపేట మొదలు నిజామాబాదుజిల్లాకు దక్షిణపుహద్దువరకు వ్యాపించి యున్నది. రెండవపంక్తి వాయవ్యమున వ్యాపించియున్నది. మంజీరానదివల్ల పశ్చిమవాయవ్యభాగములు సాగుబడియగుచున్నవి. భూమి సారవంతమైనది. జిల్లాయందంతటను చెరువులు నిండి యున్నవి. వానిలో నిజాంసాగరు రాయంపల్లి చెరువులు, చాల పెద్దవి. మంజీరానదినుండి మహబూబ్ నహరు, ఫత్తైనహరులను

రెండు కాలువలు త్రవ్వబడినవి. శీతోష్ణస్థితి ఆరోగ్యప్రదముగా నున్నది. అడవిలో ఇప్ప [మహావ] చెట్లెక్కువ. వానిపువ్వులతో సారా తీయబడును.

వరి, గోధుమలు, మొక్కజొన్నలు, జొన్నలు, ప్రత్తి, పొగాకు, పప్పుదినుసులు, చెరకు, నూనెగింజలు, ఇచ్చటి ముఖ్యపంటలు.

ప్రఖ్యాతస్థలములు :—

సంగారెడ్డిపేట:—జిల్లాయొక్కయు తాలూకాయొక్కయు ముఖ్యస్థానము. ఇచ్చట పీతాంబరములు, జరీకోకలు, మంచి పట్టుబట్టలు నేయబడుచున్నవి. మంచిన గ్గకస్థలము.

మెదకు—ఇచ్చట జాజము, పర్దాలు మొదలైనఅద్దకపు పనులు సాగుచున్నవి.

సిద్దిపేట—ఇచ్చట ఇత్తడి వెండివస్తువులు అందమైనవి తయారగును. పట్టుబట్టలకు కూడ ప్రసిద్ధి.

సదాశివపేట—మంచి వర్తకస్థలము.

రామాయంపేట—ఇత్తడి పాత్రలకు ప్రసిద్ధి.

జోగపేట, శివానగరు—ఇచ్చట తోళ్ళు పదను చేయు కర్మాగారము లున్నవి.

రంగంపేట:—నూలుకోకలకు ప్రసిద్ధి.

మద్దూరు:—ఇచ్చట కాగితములు తయారగును.

కంది:—సంగారెడ్డి కాగ్నేయమున 6 మైళ్ళలో నున్నది. ఇచ్చట జాతర యగును. ఈ జిల్లానుండి గోదావరి వ్యాలిరైలుమార్గము పోవుచున్నది.

గైరునర్సాపురియిలాక:—

నర్సాపురము, వికారాబాదు, ఇవి పాయగాయొక్క తాలూకాలు. వికారాబాదుయొక్క శీతోష్ణస్థితి మంచిఆరోగ్య ప్రదమైనది గనుక అచ్చట నున్న అనంతగిరిపై ప్రత్యేకముగ క్షయ రోగులకై వైద్యశాల కట్టదలంచియున్నారు.

నార్సింగి:—ఇది జాగీరుగ్రామము.

పశ్నలు.

1. ఈ జిల్లాలో నున్న నది ఏది? 2. ఇచ్చటి పంటలేవి? 3. ఇక్కడ అడవిలో నెట్టియుపయోగకరములైన వస్తువు లున్నవి? 4. సంగారెడ్డి, సిద్దిపేట, రామాయంపేట, జోగిపేట, ఇవి ఎందుకు ప్రసిద్ధి? 5. ఇచ్చటివర్తకస్థలములేవి? 6. ఆరోగ్య ప్రదప్రదేశ మేది?

# నిజామాబాదుజిల్లా.

ఈజిల్లాకు నుత్తరమున గోదావరినది; తూర్పున కరీంనగరు జిల్లా; దక్షిణమున మెదకు; పడమరను మంజీరానది యున్నది.

ఈజిల్లాలో నిజామాబాదు డివిజను, కామారెడ్డి, డివిజ నులున్నవి. నిజామాబాదు డివిజనులో నిజామాబాదు, బోధను తాలుకాలు; కామారెడ్డి డివిజనులో కామారెడ్డి, యల్లారెడ్డి, ఆర్మూరు తాలూకా లున్నవి.

ఈజిల్లాలో పెద్దపర్వతములు లేవుగాని చిన్నగుట్టలున్నవి. దీనికి నుత్తరపుహద్దులో గోదావరియు పడమటిహద్దులో మంజీ

రయి ప్రవహించుచున్నవి. ఇవిగాక నితరములైన ఏరులుకూడ పారుచున్నవి. కామారెడ్డి, యల్లారెడ్డిలలో పెద్ద చెరువులున్నవి. అడవిలో ఇప్పచెట్లనేకములు గలవు. చింత, టేకు, మద్ది, తడవను చెట్లు కూడ నున్నవి. ఇచ్చట శీతకాలములో ననారోగ్యము గను వేసవికాలములో నారోగ్యప్రదముగా నుండును. వరి, గోధుమలు, మొక్కజొన్నలు, పప్పుదినుసులు, చెరకు ఇక్కడ పైరగును.

ముఖ్యస్థలములు:—

నిజామాబాదు:—ఇచ్చట రైలుస్టేషనున్నది. జిల్లాకు ముఖ్యస్థానము. శ్రేష్ఠమైన చెరకు దొరకును.

ఆర్మూరు:—ఇచ్చట టస్సరుబట్టలు నేయబడును.

లింగంపేటలో నిత్తడిపాత్రలు చేయుదురు. యల్లారెడ్డిలో రెండు పురాతన దేవాలయము లున్నవి.

కామారెడ్డి:—రైలుస్టేషనుకు కొంతదూరమున టేకిరియాలలో ఆల్కహోలు తయారుచేయు కర్మాగార మున్నది.

డిచ్పల్లిలో మిషనువారి వైద్యశాల యున్నది. అచ్చట కుష్ఠరోగులకు చికిత్స చేయబడుచున్నది.

భీమగల్లులో లక్కపూసిన కర్రవస్తువులు చేయుదురు.

సైరుసర్కారియిలాక :—

కోటగిరి:—ఇది పాయగ తాలూకా.

కంధారము:—ఇది జాగీరు తాలూకా.

## ప్రశ్నలు.

1. ఈజిల్లాలో పెద్ద చెరువు లెక్కడ నున్నవి? 2. ఇక్కడ ఏచెట్లు ఎక్కువగ కనబడును? 3. ఈజిల్లాయొక్క శీతోష్ణస్థితు లెట్లున్నవి? 4. ఆర్మూరు, లింగంపేట, భీమగల్లు, యల్లారెడ్డి, కామారెడ్డి ఎందుకు ప్రసిద్ధిచెందినవి? 5. కుష్ఠరోగుల వైద్య మెక్కడ చేయబడును? 6. గ్రరుసర్కారిలాకా లేవి?

# నల్లగొండజిల్లా.

ఈజిల్లాకు ఈశాన్యమున వరంగలు, కరీంనగరు జిల్లాలు; దక్షిణమున కృష్ణానది; పడమట మహబూబ్ నగరు, అత్రాబ్ బల్దా, మెదకుజిల్లా లున్నవి. ఈజిల్లాలో నల్లగొండ, భువనగిరి, మిరియాలగూడెము లను డివిజను లున్నవి. నల్లగొండ డివిజన్ తాలూకుదారు నధికారములో నున్నది. భువనగిరిడివిజనులో భువన గిరి, జనగాము, సూర్యాపేట తాలూకాలు; మిరియాల గూడెం డివిజనులో మిరియాలగూడెం, దేవరకొండ, హుజూరు నగరు తాలుకా లున్నవి.

ఈజిల్లాలో పర్వతపంక్తుల నేకములున్నవి. ఒకపంక్తి నల్ల గొండ, దేవరకొండలగుండ మహబూబ్ నగరు వరకు వెళ్లియు న్నది. రెండవపంక్తి వాయవ్యమున వ్యాపించియున్నది. ఇచ్చట కృష్ణానది తనయుపనదులగు మూసా, పాలేరులతో ప్రవహించు చున్నది. ఈజిల్లాలో చెరువు లనేకములున్నవి. భువనగిరి తాలూ

కాలో నమలుకల్వ గ్రామమునొద్ద ఆసిఫునహారు అను కాలువ త్రవ్వబడియున్నది. ఇది యంత అనారోగ్యప్రదేశము కాకున్నను శీతకాలములో చలియు, ఎండకాలములో ఎండయు అత్యధికము. ఇచ్చట వరి, మొక్కజొన్నలు, జొన్నలు, పప్పుదినుసులు, పొగాకు నీలి పైరగును.

**ముఖ్యస్థలములు:—**

నల్లగొండ:—ఇది జిల్లాయొక్కయు తాలూకాయొక్కయు ముఖ్యస్థానము. రెండుగుట్టల మధ్య నున్నది.

భువనగిరి:—ఇచ్చట సముద్ర మట్టమునకు 2000 అడుగుల ఎత్తుగల ఒకకొండదుర్గ మున్నది. మహాత్ముడగు జమాల్ బహాదురువారి ఉర్సు జరుగును. శ్రేష్ఠములైన మట్టిజాడీలు, తమలపాకులు, అరటిపండ్లు నిక్కడ దొరుకును.

దేవరకొండలో తెలియా రుమాల్లు మంచివి దొరుకును. సూర్యాపేట, కోదాడలలో కొమ్ముతో చేసిన చేతికర్రలు లభించును.

పానగల్లులో నిత్తడిపాత్రలు చేయబడును. మద్దూరు నందలి షర్బాలు, జాజము, దస్తరుకాను బట్టలు ప్రసిద్ధమైనవి. పానుగల్లు, పిల్లలమర్రి, నాగులపాడు మొదలగుతావులలో చక్కని శిల్పముతో గూడిన దేవాలయములు పెక్కులుగలవు. వాడపల్లి, మట్టపల్లి ఈమండలమున బ్రసిద్ధక్షేత్రములు.

ఈ జిల్లాలకు నుత్తరమున ఎన్. ఎస్. రైలుమార్గము పోవుచున్నది.

గైరుసర్కారిఇలాకా:—

పోచంపల్లిజాగీరు రుమాళ్ళకు ప్రసిద్ధి. పెంబర్తిజాగీరు ఇత్తడిపాత్రలకు ప్రసిద్ధి. మొనగల్లు, లింగగిరి యివి యింగ్లీషు వారి స్వాధీనములో నున్న గ్రామములు.

## ప్రశ్నలు.

1. ఈజిల్లాలో ఉన్న పెద్దనదియు, మరియు దాని యుపనదు లేవి? 2. శీతోష్ణస్థితు లెట్లున్నవి? 3. ఇచ్చటిపంట లేవి? 8. కోదాడ, భువనగిరి, దేవరకొండ, పానగల్లు, మద్దూరు ఎందుకుప్రసిద్ధిజెందినవి? 5. ఈజిల్లాలో గైరుసర్కారుగ్రామము లేవి? అవి దేనికి ప్రసిద్ధి? 6. ఇంగ్లీషువారి స్వాధీనములో నున్న గ్రామము లేవి?



# మహబూబ్‌నగరుజిల్లా.

ఈజిల్లాకు నుత్తరమున ఆత్రాఫుబల్దజిల్లా; తూర్పున నల్లగొండజిల్లా; దక్షిణమున కృష్ణానది; పడమట రాయచూరు, గుల్బర్గ జిల్లా లున్నవి.

ఈజిల్లాలో జడచర్ల, నాగరుకర్నూలు అను రెండు డివిజను లున్నవి. జడచర్లడివిజనులో మహబూబ్ నగరు, మక్తలు, పర్గితాలూకాలు; నాగరకర్నూలు డివిజనులో నాగరుకర్నూలు, కల్వకుర్తి, అమరాబాదు తాలూకా లున్నవి.

దీనియాగ్నేయభాగము కొండప్రదేశము. నైరృతిహద్దులో కృష్ణానది ప్రవహించుచున్నది. దీనియుపనదులగు డిండి, బండోరలి యీజిల్లాను సాగుచేయుచున్నవి. ఈజిల్లాలోదట్టమైన అడవులు గలవు. వానిలో అమరాబాదు అడవి ముఖ్యమైనది. ఈజిల్లాయొక్క ఉత్తరపశ్చిమ భాగముల శీతోష్ణస్థితి ఆరోగ్యప్రదమైనది. తూర్పు దక్షిణ భాగములు వేడివైనను గాలి తడి గలిగియున్నవి.

వరి, మొక్కజొన్నలు, జొన్నలు, పప్పుదినుసులు ప్రత్తి, నూనెగింజలు, పొగాకు ఈజిల్లాయొక్క ముఖ్యమైన పంటలు.

విశేషస్థలములు:—

మహబూబ్ నగరు:—ఇది జిల్లాయొక్కయు తాలూకాయొక్కయు ముఖ్యస్థానమగు వర్తకస్థలము. రైలుస్టేషనుకు సుమారు 2 మైళ్ళ దూరములో ఒక పెద్ద మర్రిచెట్టు కొన్నివేల చదరపు అడుగుల వైశాల్యము నాక్రమించుకొనియున్నది. చాలపాతదగుటచే దానిపూర్వపు కాండమంతయు నశించి యూడల సాహాయ్యమున నిలబడియున్నది.

నారాయణపేట:—ఇది పెద్దవర్తకస్థలము. ఇది పట్టుకోకలకును, జరీఅంచుగల పంచెలకును ప్రసిద్ధి.

మక్తలు, దేవరకదర, నాగర్ కర్నూలు, అమరాబాదులలో మంచి కంబళ్లు నేయుదురు. అవి ఓవరుకోట్లకుకూడ పనికివచ్చును.

కొయ్యలకొండ, వర్ధమానపురము, గంగాపురము, ఆవంచ, కోడూరు పూర్వము రాజధానులు. ఇచట చారిత్రిక చిహ్నములు విశేషించి కలవు.

పానగల్లులో సప్తప్రాకారములు గల దుర్గ మొకటియు అం దెప్పుడును వట్టిపోని చెలమ యొకటియు గలవు.

లింగాల:—ఇది దుష్ప్రవృత్తులుగల కొన్ని తెగల వారికై ఏర్పరుపబడిన నివాసస్థలము.

మనానూరు:— ఇది కొండప్రదేశము. ఇచ్చట రాజద్రోహము చేసినవారి నుంచుదురు.

సికిందాబాదు కర్నూలు రైలుమార్గము జిల్లాకు పడమరగా బోవుచున్నది.

రైరుసర్కారియిలాక:—

ఈజిల్లాకు దక్షిణములో వనపర్తి, అమరచింత, జటప్రోలు, గోపాలపేట అను నాలుగు సంస్థానము లున్నవి.

వనపర్తి సంస్థానములో నున్న శ్రీరంగపురము అను గ్రామములో 5 రోజులవరకు పెద్దజాతర జరుగును. అచ్చట గొప్ప పశువుల సంత సాగును.

## ప్రశ్నలు.

1. ఈజిల్లాయొక్క శీతోష్ణస్థితు లెట్లున్నవి? 2. ఏయే పంటలు పండుచున్నవి? 3. నారాయణపేట, మక్తలు, దేవరకదర యివి ఎందుకుప్రసిద్ధి? 4. దురాచార జాతుల నుంచు స్థలమేది? 5. రాజద్రోహుల నుంచు స్థలమేది? 6. ఈజిల్లాగుండ

ప్రైలుమార్గము పోవుచున్నది 7. ఈజిల్లాలో గల గైరుసర్కారీ యిలాకాలు ఏవి? 8. శ్రీరంగపురము ఎందుకు ప్రసిద్ధి ?

## మహారాష్ట్ర ప్రాంతము.

# ఔరంగాబాదు జిల్లా.

ఈజిల్లా నిజాంరాజ్యములో చారిత్రిక విషయముల గూర్చి ప్రసిద్ధిచెందినది. ఇందున్న పటన్ అను గ్రామము పూర్వపు హిందూరాజుల రాజధాని యైయుండెను. దౌలతా బాదు ఒకముసల్మాన్ సుల్తాను కాలములో హిందూదేశము నకు రాజధానిగాగూడ నుండెను. ఔరంగాబాదుజిల్లా మన రాజ్యమునకు వాయవ్యమూలయం దున్నది.

ఈజిల్లాకు త్తరమున బొంబాయికి చేరిన ఖాందేశజిల్లా యున్నది. తూర్పున బరారుయిలాక పర్భనిజిల్లా యున్నది. దక్షిణమున గోదావరి ప్రవహించుచున్నది. పడమట బొం బాయి యిలాక అహమదునగరు, నాసిక్ జిల్లా లున్నవి.

ఈజిల్లాలో ఔరంగాబాదు, జాల్నయను రెండుడివిజ న్లున్నవి. ఔరంగాబాదు డివిజనులో ఔరంగాబాదు, కన్నడు, కుల్లాబాదు (సర్ఫెకాసు) విజాపురము, గంగాపురము తాలుకా లున్నవి.

జాల్న డివిజనులో జాల్న, భోకర్దన్, అంబడ్, పటన్, సిల్వాడు (సర్ఫెఖాసు) తాలుకా లున్నవి.

ఈ జిల్లాకు నుత్తరమున సహ్యాపర్వత పంక్తులు వ్యాపించియున్నవి. వానిలో అజంట, సతార, కన్నడ్, ఖండాల ఘాటు అనునవి గలవు. ఇవిగాక జాల్న, దౌలతాబాదు గుట్టలు కూడగలవు. ఈజిల్లాకుదక్షిణములో గోదావరి 127 మైళ్ల వరకు ప్రవహించుచున్నది. దీని యుపనదులు పూర్ణ, దూధన అనునవి గలవు. ఇది ఆరోగ్యకరమైన ప్రదేశము. ముఖ్యములైన పంటలు:—గోధుమలు, చోళ్ళు, జొన్నలు, మొక్కజొన్నలు, కాయధాన్యములు, చెరకు, ప్రత్తి, పొగాకు, నీలి మొదలైనవి.

ముఖ్యస్థలములు:—

ఔరంగాబాదు:— ఇది గోదావరినదికి ఉపనది యగు ఖాంనగిపై నున్నది. దీని పూర్వనామము ఖడ్కి 1009 హిజరిలో ఆపట్టణము మలిక్ అంబరు అను నొక హబ్షీసేనా నాయకునిచే స్థాపింపబడెను. తరువాత షాజహాన్ చక్రవర్తిచే జయింపబడి అతని కుమారునిపేరున ఔరంగాబాదు అని నూతన నామకరణము చేయబడెను. ఇప్పు డిది ప్రాంతమునకును జిల్లాకును ముఖ్యస్థానము. ఈపట్టణమందు పూర్వకాల మందుండి ఊటనీళ్లు సొరంగములగుండ పారించి ఇండ్లకును తోటలకును ఉపయోగింపబడు చున్నది. కింకాబు, మషరూ, హిమ్రు అను పట్టుబట్టలు యిచ్చటి ముఖ్యమైన కార్మికములు, ఇవి యిక్కడ నుండి ఎగుమతియగును. ఇచ్చటి అద్భుత భవనములలో ఆరక్ కోట, ఔరంగజేబుమహాలు, నౌఖండేభవనము. రాబియ దౌరానియొక్క సమాధిమండపము ముఖ్యమైనవి. ఇది పెద్ద వర్తకస్థలము. ఇక్కడ ఉస్మానియవిశ్వవిద్యాలయముతో

సంబంధమగు కాలేజి ఒకటి యున్నది. ఇచ్చటి జామ, రేగు, దాక్షి, మున్నగుపండ్లు శ్రేష్ఠములు.

జాల్నా:—పెద్ద వర్తకస్థలము. ఇచ్చటి కమలాఫలములు శ్రేష్ఠములైనవి.

పటణ్:—ఇది దక్కనులోని యొక పురాతన స్థలము. జరీఅంచుకోకలు మంచివి దొరుకును. ఇదిగొప్పయాత్రాస్థలము.

వీజాపూరు:—ఇదియొక వర్తక స్థలము.

అంబడ్:—ఇచ్చట స్తంభములే లేని యొక పురాతన మస్జిదు ఉన్నది.

దౌలతాబాదు:—ఇది ఔరంగాబాదునకు వాయవ్యమున తొమ్మిదిమైళ్ళదూరములో నున్నది. దీనిని దేవగిరి యను పేరున రామదేవరాజు స్థాపించెను. సుల్తానుమహమ్మదు తొగ్లకు కాలములో ఇది హిందూదేశమునకంతటికి గొంతకాలము రాజధానియై యుండెను. 150 అడుగుల నిట్టనిలువుగల కొండపై నొకకోట కట్టబడియున్నది. దానిలోచాంద్‌మినార్, చీనిమహాలు అద్భుత భవనములు. చాంద్‌మినారును సుల్తాన్ అలావుద్దీన్ కోట జయించిన జ్ఞాపకార్థము కట్టించెను. ఇది 210 అడుగులయెత్తున్నది. ఇది దక్షిణఇండియాలో మహమ్మదీయులు కట్టించిన నిరుపమాన గోపురము. చీనీమహాలు పూర్వముమంచిస్థితియందుండెను. ఇప్పుడుశిథిలమయియున్నది. ఇచ్చటి శ్రేష్ఠమైన అత్తిపండ్లు, దాక్షపండ్లు, ఇతరప్రదేశములకు పంపబడును.

ఎల్లోరా:—దౌలతాబాదునకు 8 మైళ్ళ దూరములో నున్నచిన్నగ్రామము. గ్రామసమీపమున ఇందూరు రాణియగు అహల్యాబాయి కట్టించిన యొక ఎఱ్ఱరాతిదేవాలయ మున్నది. ఇది ప్రస్తుతపు హిందూశిల్పమునందు మేలైనదిగ ఎన్నబడు చున్నది. ఈగ్రామమునకు ఒకమైలు దూరమున ఎత్తైయిన ఒక మైదానములో కొండ ప్రక్కను అనేక గుహ లున్నవి. వీనికి ఎల్లోరగుహ లని పేరు. ఈగుహాలలో బౌద్ధ, బ్రాహ్మణ, జైన, దేవాలయములు రాతిబండలలో చెక్క బడియున్నవి. ఇవి క్రీ. శ. అయిదవ శతాబ్దము మొదలు పదవ శతాబ్దమువరకు నిర్మింపబడినవి. వీనిసంఖ్య 34. వీనిలో చాల అద్భుతమైనది కైలాసమందిరము. ఇందు హిందువుల శిలాశిల్ప చాతుర్యము అతివిచిత్రముగ ప్రదర్శింపబడియున్నది.

ఆసాయి:—ఇద్దియొక చారిత్రిక ప్రదేశము. ఇచ్చట 1803 క్రీ. శ. లో ఇంగ్లీషువారు మహారాష్ట్రులను ఓడించిరి.

ఈజిల్లాగుండ గోదావరి వ్యాలిరైలు మార్గము పోవు చున్నది.

గైరుసర్కారియిలాక:—

ఖుల్దాబాదు, సిల్వాడు అను సర్బెఖాసుయొక్క రెండు తాలూకాలు దీవాని పరామర్శలో నున్నవి. ఖుల్దాబాదులో ఔరంగజేబు, ఆసిఫ్ జాహా, నాసర్ జంగ్, మలిక్ అంబరు, తానీషాల యొక్క సమాధి మండపము లున్నవి. ఇవి గాక ముసల్మాన్ మహాత్ముల సమాధు లనేకములు గలవు.

లాడ్సాన్గోయి:—ఇది పాయగాకు సంబంధించిన తాలూకా.

అజంట:—ఈజాగీరు ఔరంగాబాదుకు ఈశాన్యమున 52 మైళ్లలో నున్నది. ఇక్కడకూడ పర్వతమును తొలిచి 29 గుహాలు నిర్మింపబడియున్నవి. వీనిలో 24 బౌద్ధుల ప్రార్థన మందిరములును 5 దేవాలయములును రాతితో చెక్కబడి రంగులతో చిత్రింపబడియున్నవి. ఇవి ఎనిమిది శతాబ్దములకు పూర్వపు శిల్పనిదర్శనములైనను ఇప్పటికి వానివర్ణస్వభావము లందే మార్పును కలుగలేదు. దీనినిబట్టి ఆకాలపు నాగరకత వెల్లడియగుచున్నది.

దేఉళగాం:—ఇది జాల్నాకు 14 మైళ్ళ దూరములో నున్న జాగీరు. ఇచ్చట ప్రతిసంవత్సరము గొప్పజాతర జరుగును. వేలకొలది యాత్రికులు వత్తురు.

మాస్త్రమానాని, [illegible], ఇవి ఇంగ్లీషువారి స్వాధీనములో నున్న గ్రామములు.

## ప్రశ్నలు.

1. ఈజిల్లాలో నున్న పర్వతములును నదులును ఏవి? 2. ఇచ్చటి పంటలేవి? 3. ఔరంగాబాదు పట్టణముయొక్క ఏ వస్తువులు శ్రేష్ఠములైనవి? 4. దౌలతాబాదు, ఎల్లోరా, అజంటా, ఖుల్దాబాదు ఇవి ఎందుకు ప్రసిద్ధికెక్కినవి? 5 ఔరంగాబాదులో నున్న అద్భుతభవనము లేవి? 6. ఇంగ్లీషువారి స్వాధీనగ్రామము లెవ్వి?

# పర్భని జిల్లా.

ఇది నిజాం రాజ్యములోని ఉత్తరసరిహద్దుజిల్లా అయి యున్నది. దీని కుత్తరమున బరారు యిలాక; తూర్పున నాన్దేడుజిల్లా; దక్షిణమున బీదరు బీడుజిల్లాలు; పడమట బీడు, ఔరంగబాదు జిల్లా లున్నవి.

ఈజిల్లాలో పర్భని, హింగోళి యను రెండు డివిజను లున్నవి. పర్భనిడివిజనులో పర్భని, పాథ్రీ, జేతూరు, పాలం (సర్వెఖాను) తాలూకా లున్నవి. హింగోళి డివిజనులో హింగోళి, బిస్మతు, కలమ్నూరి తాలూకా లున్నవి

ఈజిల్లా కుత్తరమున సహ్యా పర్వతములును దక్షిణమున బాలఘాటు పంక్తులును వ్యాపించియున్నవి. దీనిమధ్య భాగము చదునుమైదాన మయి యున్నది. గోదావరి దీనికి దక్షిణములోను, పాయిని గంగ ఉత్తరహద్దునందును పూర్ణ, మధ్యభాగములోను ప్రవహించుచున్నవి. ఉష్ణప్రదేశ మయినను ఆరోగ్య ప్రద మయినది గాని శీతకాలములో జ్వరములు ప్రబలును. ముఖ్యమయిన పంటలు వరి, గోధుమలు, ప్రత్తి, చెరకు, పొగాకు, పప్పుదినుసులు. నీలి అయియున్నవి.

ఈజిల్లాలో తగు కరకార్మికములు లేకున్నను ప్రత్తిని శుభ్రపరచి, అదిమి బస్తాలుగ కట్టు కర్మాగారము లున్నవి. గోదావరి వ్యాలి రైలుమార్గము ఈజిల్లాగుండ పడమటి

వైపునకు పోవుచున్నది. పూర్ణాజంక్షను నుండి హింగోలివరకు పూర్ణాహింగోలీ రైలుమార్గము పోవుచున్నది.

ముఖ్యస్థలములు.

పర్భని:—జిల్లాకును, తాలూకాకును ముఖ్యస్థానము. ఇచ్చట జొన్నలు, ప్రత్తి, నూనెగింజలు వర్తక మధికము.

హింగోలిలో సర్కారువారు గుఱ్ఱములు, పశువులు అభివృద్ధిచేయుటకు సంస్థలు స్థాపించియున్నారు. అచ్చట మంచి జాతిగుఱ్ఱములు,ఎద్దులు సిద్ధపరుపబడి రైతుల కియ్యబడుచుండును. ఇది గోధుమలు, జొన్నలు, ప్రత్తియొక్క వర్తకస్థలము.

బిసమతు:—ఇచ్చట ప్రత్తి, జొన్నలు, నూనెగింజల వర్తక మగును.

మాన్వత్:—ఇదియొక వర్తకస్థలము. అవంధలో నాగనాథుని పురాతన దేవాలయ మున్నది. గొప్ప జాతర జరుగును.

బామని:—జేతూరు తాలూకాలో నున్నది. చందన వృక్షములు విస్తారముగ పెరుగును.

రైరుసర్కారియిలాక:—

పాలం, సర్వేఖాను తాలూకా. నదీవాని పరిపీక్షణలో నున్నది. గంగాఖేడు, పస్తూరు, సివంపేట, యివి జాగీరు గ్రామములు. సివంపేటలో మంచిపట్టుబట్టలు నేయబడును.

## ప్రశ్నలు.

1. ఈజిల్లాలోగల పర్వతములును నదులును ఏవి? 2. ఈ జిల్లాలో ఏయే రైలుమార్గము లున్నవి? 3. హింగోళి, బాసని, ఎందుకు ప్రసిద్ధి చెందినవి? 4. ప్రత్తి, జొన్నవర్తక స్థలము లేవి? 5. సైరుపర్బారి యిలాకాలు ఏవి?

# నాందేడు జిల్లా.

ఈజిల్లా నిజాంరాజ్యమున ఉత్తరములోనున్నది. దీనికి నుత్తరమున పాయెన్‌గంగ; తూర్పున ఆదిలాబాదు, నిజామాబాదు జిల్లాలు; దక్షిణమున బీదరుజిల్లా; పడమట పర్భనిజిల్లా లున్నవి.

నాందేడు, దెగ్లూరు అను రెండుడివిజను లున్నవి. నాందేడు డివిజన్‌లో నాందేడు, హాద్గాం తాలూకాలున్నవి. దెగ్లూరుడివిజను లో, దెగ్లూరు, కంధారము, బిలోలి, ముధోలు తాలూకాలున్నవి.

ఈ జిల్లాకు వాయువ్యమున మధ్య భాగములలోను కొండలు వ్యాపించియున్నవి. గోదావరీనది జిల్లాకుమధ్యగాను పాయెన్‌గంగ ఉత్తరమునను ప్రవహించుచున్నవి. కంధారము తప్ప నితరభాగమంతయు రేగడిభూమి. వ్యవసాయమునకు చెరువులు, బావులు, సహాయపడుచున్నవి. మంచివర్షములు కురియును. ఇది పొడిగాలిగల ఆరోగ్యప్రదేశము. వరి, గోధుమలు, పప్పుదినుసులు, ప్రత్తి, జొన్నలు, చెరకు, పొగాకు, నీలి ఇచ్చట ముఖ్యమైన పంటలు. ఈజిల్లాలో గోదావరి వ్యాలి రైలుమార్గము పోవుచున్నది.

ముఖ్యస్థలములు:—

నాందేడు:—గోదావరీనదీతీరమున జిల్లాకును తాలూకాకును ముఖ్యస్థానము. ఇచ్చట సిక్కులగురుగోవిందులసమాధి యున్నది. పంజాబు సిక్కులుకూడ ఈగురుద్వారమునకు దర్శనార్థము వత్తురు. పూర్వ మీగ్రామము సన్నని సెల్లాలకు ప్రసిద్ధమైనది. ఇప్పుడిచ్చట బట్టలనేయు ఉస్మాన్‌షాహీ వస్త్రాగారమున్నది. మంచిజంబుఖానాలు కూడ దొరకును.

భైంస, డిగ్లూరు, బాసరు, యివి ప్రసిద్ధస్థలములు. బాసరలో జాతర జరుగును. ఇది హిందువుల తీర్థస్థలము.

ముఖేడు:-ఇచ్చట రాగి, యిత్తడి పాత్రలు చేయబడును.

కంధారము:—ఇదిపూర్వము బరీదుషాహి సుల్తానుల రాజధానియై యుండెను. ఇచ్చట నొకకోట యున్నది. హాజీ సయ్యాహ మహాత్ముని ఉరుసు మిగుల నాడంబరముతో జరుగును.

మాలీగాం:—ఇచ్చట ప్రతిసంవత్సరము ఒకనెలవరకు జాతర జరుగును. అందు పశువుల యొక్కయు ముఖ్యముగా గుఱ్ఱముల యొక్కయు వ్యాపారము జరుగును.

సైరుసర్కారియిలాక:—

కొండలవాడి:—ఇది పాయగా తాలూకా.

ఖడకి, బారహేలి—ఇవి సర్ఫేఖాసు యిలాకాలు.

ముదునూరు:—ఇది జాగీరు తాలూకా.

ప్రశ్నలు.

1. ఈజిల్లాలో వ్యవసాయమునకుగలనీటిఆధారములేవి? 2. వర్షస్థితియు, శీతోష్ణస్థితులును ఎట్లున్నవి? 3. నాన్దేడు, ముఖేడులలో దొరుకు మంచివస్తువు లేవి? 4. ఈజిల్లాలో వస్త్రములు నేయుపెద్దకర్మాగారమెక్కడనున్నది? 5. పెద్దవర్తకస్థలములేవి.



# బీడు జిల్లా.

ఈజిల్లా నిజాం రాజ్యము యొక్క పడమటి హద్దులో ఔరంగాబాదు జిల్లాకు దక్షిణమున నున్నది. దీనికుత్తరమున గోదావరీనది, తూర్పున పర్భని, బీదరుజిల్లాలు; దక్షిణమున మంజీర నది; పడమట సేననది; ఇంగ్లీషువారి అహమదు నగరుజిల్లా యున్నవి.

ఈజిల్లాలో బీడు, మోమినాబాదు అను రెండు డివిజను లున్నవి. బీడుడివిజనులోబీడు,పాటోడ,అష్టి తాలూకాలు తాలుక్దారునధికారములో నున్నవి. మోమినాబాదు డివిజనులో మోమినాబాదు, మంజలేగాం, గేవరాయ తాలుకా లున్నవి. ఈజిల్లాస్వాభావికముగ రెండు భాగము లైయున్నది. ఒకభాగములో బాలఘాటు పర్వత పంక్తి యున్నది. రెండవ దానిలో పాయిన్ ఘాటు ఉన్నది. ఈజిల్లాకు ఉత్తర హద్దులో గోదావరీ నది ప్రవహించుచున్నది. మంజీర తన యుపనదులతో దక్షిణ భాగమును సాగుచేయు చున్నది. ఈజిల్లాలో బావు లనేకము

లున్నవి. వీనిలో బీడుసమీపమున నొక ఖజానబావి యున్నది. దీనినీరు 529 ఎకరములను సాగుచేయుచున్నది. ఇది సమ శీతోష్ణమై, ఆరోగ్యమైనప్రదేశము. గోధుమలు, పప్పుదినుసులు, వరి, జొన్నలు, మొక్కజొన్నలు, చెరకు, నీలి, పొగాకు ఇచ్చటపైరగును.

ముఖ్యస్థలములు:—

బీడు:—ఇది జిల్లాకు ముఖ్యస్థానము. గుడ్డీలు ఛాగళ్ళ కొరకు ప్రసిద్ధి.

మోమినాబాదు:—ఇచ్చట జోగాయి దేవాలయము నొద్ద నొక పెద్దజాతర జరుగును.

పర్లి:— మోమినాబాదుకు 14 మైళ్ళ దూరములో ఈశాన్యమున నున్నది. ఇచ్చటవైద్యనాథ దేవాలయమున్నది. హిందువులతీర్థస్థలము. మంచివర్తకస్థానము.

మంజ్లేగాం, గేవరాయి:— ఈరెండు వర్తకస్థలములు.

తిల్వాడ:—ఇచ్చట తిల్డోని యను జాతర ఒక నెలవరకు జరుగును.

గైరుసర్కారియిలాక:—

పాటోధ:— దీవాని కొప్పగింత యైన సర్వేఖాను యొక్క తాలూకా.

జంఖేడు, డోక్గాం, ఖడద, అమళ్లేజు, సాస్గాం - ఇవి ఇంగ్లీషువారి స్వాధీనగ్రామములు.

### ప్రశ్నలు.

1. ఇచ్చటనున్న కొండలును నదులును ఏవి? 2. గుప్తీలు, ఛాగళ్లు ఎక్కడ దొరకును? 3. ఎక్కడెక్కడ తీర్థములు, జాతరలు జరుగును? 4. మంచి వర్తకస్థానము లేవి? 5. ఇంగ్లీషువారి స్వాధీనగ్రామము లేవి?



## గుల్బర్గ జిల్లా.

ఈజిల్లాకు త్తరమున ఉస్మానాబాదు, బీదరు జిల్లాలు: తూర్పున అత్రాపుబల్దా, మహబూబునగరు జిల్లాలు; దక్షిణమున కృష్ణానది, పడమర బొంబాయి యిలాకాకు చేరిన బీజాపూరు, షోరాపూరు జిల్లాలున్నవి. ఈజిల్లాలో సేడం, షోరాపూరు అను రెండుడివిజన్లున్నవి. సేడండివిజనులో సేడం, గుల్బర్గ, కొడంగలు చించోళి తాలూకాలున్నవి. షోరాపూరు డివిజనులో షోరాపూరు, షాపూరు, యాదగిరి అందోల తాలూకాలున్నవి. ఈజిల్లాకు త్తరమున బాలఘాటుయొక్క ఒకశాఖ వ్యాపించియున్నది. కృష్ణానది కుపనదియగు భీమ నిజాంరాజ్యములోనికి పడమటివైపునుండి ప్రవేశించి ఈజిల్లాలో 150 మైళ్లు ప్రవహించుచున్నది. ఇచ్చటి శీతోష్ణస్థితులు నానావిధములుగనున్నవి. వరి, జొన్నలు, గోధుమలు, పప్పుదినుసులు, చెఱకు, పొగాకు, నీలి మొదలైనవి యిచ్చటి ముఖ్యములైన పంటలు.

ముఖ్యస్థలములు:—

గుల్బర్గ:—చాల పురాతనపట్టణము. 746 హిజరీలో సుల్తాన్ అల్లావుద్దీన్ హాసన్ బహమని దీనిని స్వాధీనపరచుకొని తన రాజధానిగ ఏర్పరచుకొనెను. చాలకాలమువరకిక్కడే యుండెను. ఇక్కడ శిథిలమైన కోటయందున్న జామె మసీదు ఉండలీసుయొక్క కర్దొబా పట్టణమందున్న ప్రసిద్ధమసీదునమూనా ననుసరించి నిర్మింపబడెను. ఇది మహమ్మదీయులు నిర్మించిన శ్రేష్ఠములైనయద్భుత భవనములలో నొకటియైయున్నది. బహమని సుల్తానులసమాధి మంటపములు, సెంటుగిల్లులు, హాజరత్‌ఖాజబందె నవాజుమహాత్ముల సమాధిచూడదగిన యోగ్యములు. మహాత్ముని సమాధి యొద్ద ప్రతిసంవత్సరము జిఖాయుద్ నెల 16 తేది గొప్పఉర్సు జరుగును. దూరప్రదేశములనుండి వేనవేలు భక్తులు వచ్చిదర్శించెదరు. జైలులో జంబుకానాలు, గుడారములు శ్రేష్ఠమైన నూలుబట్టలు తయారగును. ఇచ్చటనుండి తెలంటుకొను మంచి మసాల ఎగుమతి యగును. ఇది పెద్ద వర్తకస్థలము.

యాదగిరి:— మంచివర్తకస్థలము. ఇక్కడ తుర్కీ టోపీల కుచ్చులు తయారయి ఎగుమతి యగును. ఒక కోట కూడ నున్నది.

కొడంగలు, మట్కాలు:— ఈరెండుగ్రామములలోను నూలు, పట్టు బట్టలు నేయుదురు.

సుల్తానపేట, చించోళి, ఘటికేశ్వరము:—సన్నకంబళ్ల కొరకు ప్రఖ్యాతి చెందినవి. చించోళి, సేడంలో గనులనుండి పలుపురాయి తీయబడుచున్నది. సేడం పెద్ద వర్తకస్థలము

మద్దూరు:— లుంగీలకొరకు ప్రసిద్ధి. ఈజిల్లాలో ఎస్.యస్; జి. ఐ. పి రైలుమార్గములు పోవుచున్నవి. వీని యన్నిటియొక్క జంక్షన్ వాడియై యున్నది.

గైరుసర్కారియిలాక:—

షోరాపూరు, షాపూరు, అందోల యివి దీవానీబప్ప గింతలో నున్న సర్ఫెఖాసుతాలూకాలు; షోరాపూరు షాపూరులలో మంచి నూలు పట్టు కోకలు నేయబడును.

పూర్వము షోరాపూరు బేడరులరాజధానియై యుండెను. ఇప్పుడు పెద్దవర్తక స్థలము. వాడి, షాబాదు, ఆలందు, బషీరాబాదు, అఫ్జల్‌పూరు, ఇవిపాయగాయొక్క తాలూకాలు. వాడి పెద్దరైలుజంక్షన్. షాబాదులో రాతిగనియు సిమెంటు చేయుపెద్ద కర్మాగారము నున్నది. ఇది పెద్ద వర్తకస్థలము.

కోసిగి, చితాపూరు తాండూరు, కళ్యాణి యివిజాగీరు యొక్క తాలుకాలు. కోసగిలో టస్సరుబట్టలు తయారగును. చితాపూరు, తాండూరులయొక్క గనులనుండి పరపురాయి తీయబడుచున్నది. చితాపూరులో క్రీ॥శ॥ 16 వ శతాబ్దమందు కట్టినయొక విచిత్రమైన గిర్జ (క్రైస్తవుల ప్రార్థనమందిరము) యున్నది. దీనిని గోవాలోనుండిన పోర్చుగీసువారు కట్టిరి.

## ప్రశ్నలు.

1. గుల్బర్గ కొడంగలు మద్దూరు- ఇచ్చటనేయేమంచి వస్తువులు దొరుకును? 2. కంబళ్ళు టోపీలకుచ్చులు ఎక్కడ సిద్ధ మవుచున్నవి? 3. గుల్బర్గాలోనున్న అద్భుతభవనములేవి?

# గుల్బర్గా జిల్లా




| గుర్తులు | వివరము |
|---|---|
| | పెద్దరైలు |
| | నది |

4. నేలురాయి ఎక్కడెక్కడబయలు దేరుచున్నది? 5. దీవాని కప్పగింపబడిన గైరుసర్కారియిలాకాలేవి? 6. షోలాపూరు, షాపూరు, కోసలగిరియొక్క ఏకరకార్మికములు ప్రసిద్ధిచెందినవి.

---

## ఉస్మానాబాదు జిల్లా.

ఈజిల్లాకుత్తరమున మంజీరనది, బీడుజిల్లా; తూర్పున బీదరుజిల్లా; దక్షిణమున గుల్బర్గజిల్లా; పడమట బొంబాయి యొక్క షోలాపూరుజిల్లా యున్నది.

ఈజిల్లాలోఒక్కడివిజన్ మాత్రమేయున్నది.తుల్జాపూరు, లాతూరు, కల్లము [సర్ఫెఖాసు], పేనడ [సర్ఫెఖాసు] తాలూకాలు ఈడివిజనుకు చేరిన తాలుక్దారు అధికారములో నున్నవి. బాలఘాటుపంక్తి జిల్లాకు ఈశాన్యమునుండి నైరృత్యముగా వ్యాపించియున్నది. మంజీరనది జిల్లాకుత్తరహద్దులోను, సీనానది పడమరను, తీర్ణానది మధ్యప్రదేశములోను ప్రవహించుచున్నవి. జిల్లాయొక్క శీతోష్ణస్థితులు నానావిధములుగనున్నవి.

వరి, గోధుమలు, జొన్నలు, పప్పుదినుసులు, చెరకు పొగాకు - ఇచ్చటి ముఖ్యములైన పంటలు.

ఈజిల్లాలో బార్సిలాయిటు రైలుమార్గము పడమర కురుదువాడి మొదలు తూర్పున లాతూరువరకు పోవుచున్నది.

ముఖ్యస్థలములు.

ఉస్మానాబాదు:— ఇది జిల్లాయొక్క ముఖ్యస్థానము. పెద్దవర్తకస్థలము. ఇక్కడనుండి ఈశాన్యమున రెండు మైళ్ళ

దూరములో పీనా యను సప్తగుహాసమూహ మున్నది. నాలుగు గుహాలలో జైనుల దేవాలయములును మిగిలినవానిలో వైష్ణవుల దేవాలయములు నున్నవి. ఇవి చాల పురాతనమైనవి. ఈగుహాలు క్రీ. శ. 5-6 శతాబ్దముల మధ్యకాలములో నిర్మింపబడినవి.

లాతూరు:— ఇది పెద్దవర్తకస్థలము.

ధైరు:—ఇది ఉస్మానాబాదుకు 12 మైళ్ళదూరములో ఈశాన్యమున నున్నది. ఇచ్చట బౌద్ధుల పురాతన దేవాలయములును మఠములును నున్నవి.

తుల్జాపూరు:—ఇది ఉస్మానాబాదుకు 14 మైళ్లదూరములో నున్నది. పెద్దయాత్రాస్థలము. తుల్జాభవాని దేవాలయమున్నది. దీని దర్శనార్థము యాత్రికులు దూరప్రదేశములనుండి వత్తురు.

ఔస:—ఇక్కడ బీజాపూరు సుల్తానులచే నిర్మింపబడిన చతురాకారమైన కోటయున్నది. దీనిలో 18 అడుగుల పొడుగు గల ఒకఫిరంగియున్నది. ఔరంగజేబు సుబేదారుగా నున్నకాలములో కట్టినమసీదుకూడ గలదు.

నల్దుర్గ:— ఇచ్చట బోరీనది మధ్యపానిమహాల్ అను అద్భుతభవన మొకటి 300 సంవత్సరముల క్రిందట కట్టబడినది. దీనిపైనుండి నది ప్రవహించుచున్నది. ఇంతవరకు మరమ్మతు చేయవలసినయవసరము లేకుండనున్నది. ఇక్కడ నున్నకోట కూడ ప్రసిద్ధిచెందినదే. షట్చక్రవర్తులలో నొకడగు నలుండీతావున రాజ్య మేలినటుల జెప్పుదురు. ప్రాచీనపురిహ్నము లీగ్రామమున విశేషించి కలవు.

గైరుసర్కారియిలాకా.

ఉస్మానాబాదు, కల్లము, పరేండ, యివిదీవాని కొప్పగింపబడిన సర్ఫెఖాసు తాలూకాలు. వీనిలో పరేండయొక్క పురాతనకోట ప్రసిద్ధమైనది. దీనిని క్రీ. శ. 15 న శతాబ్దములో బహమని సుల్తానుల మంత్రియగు మహామూదుగావాఁ కట్టించెను. లోహార, గంజోటి యివి పాయగాయొక్క తాలూకాలు.

భూం:—ఇది యొక జాగీరు. చరిత్రప్రఖ్యాతప్రదేశము. ఇచ్చట నవాబు నిజామలీఖానకును, మహారాష్ట్రులకును యుద్ధము జరిగెను.

బార్సి, సునారి, సావరిగాం, మంగ్రోలు, అక్లి, ఇవి ఇంగ్లీషువారి స్వాధీనగ్రామములు.

ప్రశ్నలు.

1. ఈజిల్లాలో నున్న పర్వతములును నదులును ఏవి? 2. ఏయేవస్తులు ఉత్పత్తియగుచున్నవి? 3. హిందువుల పెద్ద తీర్థస్థానమేది? 4. బౌద్ధమతపురాతనచిహ్నము లెక్కడ కనిపించుచున్నవి? 5. గైరుసర్కారి యిలాకాలో పాయగాయొక్క తాలుకాలేవి? 6. ఇంగ్లీషువారి స్వాధీనగ్రామము లేవి?

## బీదరు జిల్లా.

ఈజిల్లాకు ఉత్తరమున పర్భని, నాందేడుజిల్లాలు; తూర్పున నిజామాబాదు మెదకుజిల్లాలు; దక్షిణమున గుల్బర్గజిల్లా, పడమట ఉస్మానాబాదు, బీడు జిల్లా లున్నవి.

ఈజిల్లాలో ఊద్గీరు డివిజను మాత్రమే గలదు. దీని తాలుకాలు:—ఊద్గీరు, బీదరు, అహమదుపూరు, నల్లంగ, జన్వాడ (సర్ఫెఖాను).

బీదరు ఒకపురాతనపురము. దీనిమధ్య ఊద్గీరుపర్వత పంక్తివ్యాపించియున్నది. మంజీరానది తనయుపనదులగు తీర్న, కారంజనహ జిల్లాను సాగుచేయుచున్నవి. వరి, గోధుమలు, యవలు, చెరకు, పొగాకు, ప్రత్తి ఇచ్చటిముఖ్యములైన పంటలు. ముఖ్యస్థలములు.

బీదరు:—ఈపట్టణముఉన్నతమైన ఆరోగ్యప్రదప్రదేశ మందున్నది. దీనినిబహమనిసుల్తానులలో10 వ సుల్తానగుఅహ మదుషా మహాత్ముడు 1430 క్రీ. శ. లో స్థాపించెను. ఇది బహ మని సుల్తానులరాజధానియైయుండెను. జామెమస్జిదు,16 స్తంభ ముల మస్జిదు, మహమూదుగావాను పాఠశాల, పురపశ్చిమ భాగములో బురీదుషాహి సమాధిమండపములు, ఆగ్నేయ మున బహమని సుల్తానుల సమాధిమండపములును, ఇచ్చటి యద్భుతభవనములు. ఇవిగాక పాపనాశమను జలపాతము, ఫర్హాబాగ్, సయ్యదు సాదాతుల చలములు చూడతగినవి.

పంచలోహములో చేయబడినవస్తువులకు బంగారు, వెండిరేకు లమర్చు కరకార్మికముకొరకీపట్టణము పేరుపొంది నది. ఇచ్చట బొత్తములు, పాందానులు, కూజాలు, హుక్కా లు, మొదలైనవి సిద్ధపరచి యెగుమతిచేయబడును. మరియు

గృహోపయోగమునకు తగిన మృదువైన తేలిక పాదరక్షలు కూడ తయారగుచున్నవి.

ఉద్గీరు:-ఇచ్చట బీజాపూరు సుల్తానులు క్రీ. శ. 1493లో కట్టినకోట యున్నది. మరియు ఇచ్చట నవాబుసలాబత్ జంగు కును మహారాష్ట్రులకును గొప్పయుద్ధము జరిగెను.

కోహీరు:—బీదరుకుఆగ్నేయమున 24 మైళ్లలోనున్నది. ఇక్కడ శ్రేష్ఠమైన మామిడిపండ్లును జామపండ్లును దొరకును.

గైరుసర్కారియిలాక:—

జవ్వాడ:—ఇది దీవానీ పరిపాలనలో నున్న సర్ఫెఖాసు తాలుకా; చట్గోప, నారాయణ ఖేడ్, ఘుడ్వాడి, భాల్కి, అఖేలి, ప్రతాబపురము, హసనఆబాద్, చించోళి, ఇవి పాయగా తాలూకాలు.

మృగదేవిని:—ఇది జాగీరు యొక్క తాలుకా. నిజాం రాజ్యములో గొప్పపశువుల సంత స్థలము. సంవత్సరములో నాలుగునెలలవరకు సంత సాగును.

## ప్రశ్నలు.

1. ఈజిల్లాలో ఏయేకొండలు, నదు లున్నవి? 2. ముఖ్యమైన పంటలేవి? 3. బీదరు, కోహీరు నందలి ప్రసిద్ధములైన వస్తువులేవి? 4. బీదరుపురమందలి దర్శనీయ ప్రదేశము లేవి? 5. గైరుసర్కారియిలాకగ్రామము లేవి? 6. మృగదేవినిఎందుకు ప్రసిద్ధిచెందినది?

# రాయచూరు జిల్లా.

ఈజిల్లా నిజాం రాజ్యమునకు నైరృతిమూల హద్దునం దున్నది. దీనికుత్తరమున కృష్ణానది, తూర్పున మహబూబ్ నగరు జిల్లా, దక్షిణమున తుంగభద్రానది, పడమరలో బొంబాయియొక్క బీజాపూరు, ధార్వాడజిల్లా లున్నవి. ఈజిల్లా కృష్ణా తుంగభద్రానదుల మధ్య నుండుటచే రాయచూరు, అంతర్వేది యనిపించుచున్నది. ఈజిల్లాలో రెండుడివిజ న్లున్నవి. రాయచూరుడివిజనులో రాయచూరు, అలంపూరు, మానవి, దేవదుర్గ తాలుకా లున్నవి. లింగసుగూరు డివిజన్ లో లింగసుగూరు,సింధనూరు, గంగావతి, కుష్టగి తాలుకా లున్నవి.

దీనికి నైరృత్యమునందు యామనిగడు పంక్తియొక్క శాఖలు వ్యాపించియున్నవి. ఈజిల్లాలో తుంగభద్రానదినుండి గంగావతి కాలువ, బేచలు కాలువలు త్రవ్వబడినవి. మొదటి కాలువనుండి గంగావతితాలుకాలో మెట్లకాలువ,పల్లపుకాలువ లనబడు రెండుపిల్లకాలువలు త్రవ్వితీయబడినవి. ఇచ్చటి చెరువులలో బాయుడిన్నర్పెడు ముఖ్యమైనది. శీతోష్ణస్థితులు నానా విధములుగ నున్నవి. వర్షఋతువులో మలేరియ జ్వరము ప్రబలును. గ్రీష్మఋతువులో ఎండ తీవ్రముగానుండును. ఈజిల్లాలో నితరజిల్లాలకంటె వర్షములు తక్కువ గనుక పలుమారు కరువు సంభవించుచున్నది. భూమి మంచిదగుటచే వర్షించిన నప్పుడెల్ల మంచిపంటలు పండును. గోధుమలు, వరి, జొన్నలు,పప్పుదినుసులు, చెరకు, పత్తి, పొగాకు నీలిముఖ్యములైన పంటలు.

ఈజిల్లాగుండా ఎం. అండ్ ఎస్. ఎం. రైలు మార్గము పోవుచున్నది.

**ముఖ్యస్థలములు:—**

రాయచూరు:—ఇది జిల్లాకును తాలూకాకును ముఖ్యస్థానము. పెద్దవర్తకస్థలము. ఇచ్చట మృదువైన పాదరక్షలును మంచి మట్టిజాడీలును దొరకును.

గంగావతి:—ఇది పెద్దవర్తక స్థలము.

ముద్గలు:-ఇదియొక చారిత్రికస్థలము. ఇచ్చట బీజానగరపు రాజుకును సుల్తాను ఫైరోజషా బహామనీకిని యుద్ధము జరిగెను?

అలంపూరు:—చాళుక్యులు, చోడులు, కాకతీయులు కట్టిన దేవళములు శాసనములునిట పెక్కులుగలవు. పూర్వమిది శైవమతమునకు ప్రధానస్థలముగనుండెను. ఇచటిశిల్పముప్రశస్తమైనది. శ్రీరాములవారు వనవాసకాలములో నిక్కడ కొన్ని రోజులు నివసించిరట. ఇది పెద్దవర్తకస్థానము. జంబుకానాలు, శాంజనీలు, తర్బూజ, ఖర్బూజపండ్లకు ప్రసిద్ధి కెక్కినది.

కుష్టగిలో నూలు, పట్టుకోకలు మంచివి నేయుదురు. కనకగిరిలో దేవాలయము లధికము. మట్టిబొమ్మలకు ప్రసిద్ధి. రాయచూరుతాలూకాలో నరగడ, మానవి తాలుకాలో ఆత్మకూరు, ఈరెండుగ్రామములలో పశువులసంతలు సాగును.

**గైరుసర్కారియిలాకా:—**

గద్వాలు, గురుగుంట, అనగొంది, యివి సంస్థానములు. గద్వాలులో మంచి పట్టుకోకలు దొరకును.

కొప్పలు, యల్బర్గ, ఇవి జాగీరుగ్రామములు. పూర్వము యల్బర్గ, సింధియాకు రాజధానియైయుండెను. పెద్దవర్తకస్థలము.

కన్నాలు:—కొప్పలుకు 6 మైళ్ల దూరములోనున్న జాగీరు. ఇచ్చట అందమైన ఆటవస్తువులు చేయబడును. భరావూరు, అల్వందికి సమీపమున నున్నది. హిందువుల పుణ్యక్షేత్రము.

మోసాగ్రి, హనుమనహాలు, ఇవి యింగ్లీషువారిస్వాధీన గ్రామములు.

ప్రశ్నలు.

2. రాయచూరు అంతర్వేదియని ఎందు అనుపించుచున్నది? 2. ఎచ్చటెచ్చట కాలువలుత్రవ్వబడినవి? 3. వర్షము, శీతోష్ణసితు లెట్లున్నవి? 4. రాయచూరు, అలంపూరు, కుష్టగి, ముద్గలు, ఆత్మకూరు, ఇవి ఎందుకు ప్రసిద్ధి? 5. సైరుసర్కారి యిలాకగ్రామము లేవి? 6. ఇంగ్లీషువారి స్వాధీనగ్రామము లేవి?

---

# ఉపయుక్త విశేషములు.

1. ప్రత్తి పర్భనిజిల్లాలో అత్యధికముగను మెదకు జిల్లాలో బహుస్వల్పముగను పైరగుచున్నది.

2. గోధుమలు ఔరంగాబాదుజిల్లాలో అత్యధికముగను, అత్రాఫుబల్దాలో బహుస్వల్పముగను పైరగుచున్నది.

3. బియ్యము నిజామాబాదుజిల్లాలో అధికముగను ఔరంగాబాదుజిల్లాలో స్వల్పముగను పైరగును.

4. జొన్నలు ఆదిలాబాదు జిల్లాలో హెచ్చుగను అత్రాఫుబల్ద జిల్లాలో తచ్చుగను పైరగును.

5. నూనెదినుసులు నల్గొండ జిల్లాలో మెండుగను బీదరు జిల్లాలో స్వల్పముగను పైరగుచున్నవి.

6. పప్పుదినుసులు మెదకుజిల్లాలో అధికముగను, నల్గొండజిల్లాలో కొద్దిగను పైరగుచున్నవి.

7. వర్షము ఆదిలాబాదుజిల్లాలో విశేషముగను రాయచూరు జిల్లాలో తక్కువగను కురియుచున్నది.

8. జనసంఖ్య అత్యధికముగ నున్న పట్టణము హైదారాబాదు. దానిలో చదరపు మైలు 1 కి సుమారు ఎనుబదివేల మనుష్యులు నివసించుచున్నారు.

9. బహుస్వల్పజనసంఖ్యగల జిల్లా ఆదిలాబాదు. ఇచ్చట చదరపుమైలు 1కి దాదాపు నూరుమంది నివసించుచున్నారు.

[నిజాం రాజ్యములోని జిల్లాల జనసంఖ్య.]

హైద్రాబాద్ పట్టణము ........................ 4,66,894

| | | | | |
|---|---|---|---|---|
| నగరపరివేష్టన జిల్లా | 4,99,661 | ఔరంగబాదు జిల్లా | | 9,44,798 |
| వరంగలు | ,, 11,17,698 | బీడు | ,, | 6,88,690 |
| కరీంనగరు | ,, 12,41,405 | నాన్దేడు | ,, | 7,22,081 |
| ఆదిలాబాదు | ,, 7,62,080 | పర్భని | ,, | 8,58,760 |
| మెదకు | ,, 7,38,665 | గుల్బర్గ | ,, | 13,25,008 |
| నిజామాబాదు | ,, 6,23,225 | ఉస్మానాబాదు | ,, | 6,91,068 |
| మహబూబ్ నగరు | 9,71,616 | బీదరు | ,, | 8,78,615 |
| నల్లగొండ | ,, 11,33,409 | రాయచూరు | ,, | 9,37,535 |

# పరీక్షాప్రశ్నలు.

1. భూమి గోళముగా నున్నదనుటకు మూఁడు నిదర్శనము లిందు
2. ప్రపంచములో నుండుఖండములు, మహాసముద్రము లెన్ని? వాని పేళ్లు చెప్పుము?
3. హిందూదేశమందు నిజాంరాజ్యము ఎట్టిసై సర్గిక స్థానము కలిగియున్నది?
4. హిందూదేశముయొక్కయు, దక్కనుయొక్కయు స్వాభావికమయిన ఎల్లలు ఏవి?
5. నిజాంరాజ్యమందు భూమి యేవైపున వాలియున్నది? అది ఎట్లు గ్రహింపనగును?
6. తెలంగానకును, మహారాష్ట్రప్రాంతమునకును గల తారతమ్యము లేవి?
7. నిజాంరాజ్యముయొక్క గొప్పపర్వతపంక్తులను బేర్కొనుము?
8. దక్కలో నున్న పెద్దనదు లేవి?
9. మన నదులలో ఓడల సంచార మెందుకు లేదు?
10. శీతోష్ణస్థితుల ననేమి? ఒకదేశముయొక్క శీతోష్ణస్థితులను కనుగొనుటకు ఏయేసంగతులు తెలిసియుండవలెను?
11. నిజాంరాజ్యము నిరక్షరేఖకు సమీపమందున్నను అత్యధికోష్ణముగ లేకుండుటకు కారణ మేమి?

12. ఋతుపవనము లన నేమి? ఇవి మన దేశములో ఎప్పుడు వీచును?

13. మనరాజ్యములో వర్షస్థితి ఎట్లున్నది?

14. నిజాం రాజ్యములో మహారాష్ట్ర ప్రాంతమునకంటె తెలంగానలో వర్షమధికముగ నుండుటకు కారణ మేమి?

15. నిజాంరాజ్యములో నీటిపారుదలకొరకుగలనదుపాయము లేవి?

16. నిజాంరాజ్యములో ఈదిగువవస్తువులు ఎక్కడ నెక్కువగా పైరగును? వరి, ప్రత్తి, గోధుమలు, జొన్నలు, ఆముదములు, అవిసెపైరు.

17. మనదేశములో అరటిపండ్లు, కమలాఫలములు, అత్తిపండ్లు, దాక్షపండ్లు, ఖర్బూజాలు ఎక్కడ పైరగును?

18. టేకు, మద్ది, మొదలైన యిండ్లకలప ఎక్కువగా నెక్కడ దొరుకును?

19. గనిబొగ్గు, సీలురాయి, ఇనుము, జేగురురాయి ఎక్కడ కనిపించుచున్నది?

20. నిజాంరాజ్యముయొక్క ఎగుమతిదిగుమతిసరకు లేవి?

21. రైలువలన గలుగు లాభములు చెప్పుము? మరియు మన రాజ్యములో నడుచు రైలుమార్గము లేవి?

22. (i) హైదరాబాదునుండి ఔరంగాబాదువరకు (ii) గుల్బర్గ నుండి వరంగలువరకు రైలుమీద పోవలెనన ఏస్టేషను

మార్గములమీదుగ పోవలెను? దారిలో నేయే పట్టణములు కనబడును?

**23.** నిజాం రాజ్యములో వ్యావహారికవిద్యలస్థితి యెట్లున్నది?

**24.** ఈదిగువ నుదాహరించిన కర్మాగారములు ఎక్కడెక్కడ నున్నవి? హింరూ, టస్సరు బట్టలు, పీతాంబరములు, తేలియారుమాళ్లు, కంబళ్లు, వెండితీగవస్తువులు, ఇత్తడి పాత్రలు, గాజుసామానులు, సిమెంటు, ఆల్కహాలు.

**25.** నిజాంరాజ్యములో వ్యాప్తిచెందిన పెద్దమతము లేవి?

**26.** మనరాజ్యములో నెన్ని భాషలు భాషింపబడుచున్నవి? వీనిలో దేశీయభాష లనదగినవి యేవి?

**27.** మనరాజ్యము ధరిపాలనారీతినిబట్టి ఎట్లు విభజింపబడినది?

**28.** నిజాంరాజ్యములో నెన్ని జిల్లా లున్నవి?

**29.** హైదరాబాదుపట్టణమునుగురించి క్లుప్తముగా వర్ణింపుడు?

**30.** ఈదిగువ నుదాహరించిన ప్రదేశములు ఎక్కడ నున్నవి? ఎందులకు ప్రసిద్ధి? గోల్కొండ, సికిందరాబాదు, సింగరేని, వికారాబాదు, కామారెడ్డి, డిచ్పల్లి, తుల్జాపూరు, ఆర్మూరు, పెంబర్తి, సిర్పూరు, మృగదేవిని, నారాయణపేట, యల్లోర, హింగోళి, యాదగిరి, షాబాదు, మాలీగాం, మాహోరు, పేరిడ.

31. నిజాంరాజ్యపు పటమును గీచి దానిలో (i) గొప్ప పర్వత పంక్తులను (ii) ముఖనదులను (iii) పెద్ద చెరువులను (iv) రైలుమార్గములను చూపుము.

32. హైద్రాబాదు ఔరంగాబాదుల యొక్క దర్శనీయ[అద్భుత] భవనములను పేర్కొనుడు?

33. నిజాం రాజ్యములో చూడదగిన పురాతనపు కట్టడము లేవి?

34. నిజాంరాజ్యములోని ముఖ్యతీర్థయాత్రాస్థలము లేవి?

